*Issued on 4— 2—1957*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

## OFFICIAL REPORT

*TUESDAY, the 27th MARCH, 1956.*

VOLUME VI — No. 3.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Tuesday, the 27th March* 1956.

The House met in the Assembly Hall, Kurnool, at halfpast eight of the clock, Mr Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

## SHORT NOTICE STARRED QUESTIONS

### *Repair of tanks in Mungamoor village.*

645-A.—

S.N Q. No. 1293-F. Q—SRI B. RAMAKRISHNA REDDI.—Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) whether the Government received any representation from the ryots of Mungamoor village, Kavali taluk, Nellore District regarding the neglect of repair of tanks since a long time; and

(b) if so, the action taken thereon?

THE HON SRI K. CHANDRAMOULI:—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI S. VEMAYYA:—అధ్యక్షా, ఈ చెరువు సరియైన పరిస్థితిలో లేదని ప్రభుత్వానికి తెలుసునా? తెలిస్తే దాని మరమ్మతులు చేయడానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నాలు చేస్తున్నదా?

THE HON. SRI K. CHANDRAMOULI:—దానిని గురించి information call for చేశారు. వచ్చినతరువాత ఆలోచిస్తాము.

### *Tank for Paddavaram.*

645-B.—

S.N. Q. No. 1300-F. Q—SRI B. RAMAKRISHNA REDDI:—Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) whether the Government have received any representation from the ryots of Paddavaram, Kavali taluk, Nellore

district requesting the Government to form a tank for their village ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, దీని విషయములో కూడా పై మాదిరిగానే చెబుతారా ? లేక information ఏమైనా ఉన్నదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇది short notice question. ఇది వేసేప్పటికి ఆఫీసులో భోగట్టా లేదు. అక్కడ representation ఏమీ లేదు. భోగట్టాకో అని వ్రాశాము. రాగానే చెబుతాము.

STARRED QUESTIONS.

*Supply of High level canal water to the Gooty tank.*

626—

*976 Q.—SRI M. RAJARAM :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether it is a fact that there is no possibility of supplying high level canal water to the Gooty tank in Anantapur District ; and

(b) if so, the reasons therefor ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) No. The Guntakal Branch of the High Level Canal will feed the Gooty Tank of Anantapur District.

(b) Does not arise.

SRI S. NARAYANAPPA :—అధ్యక్షా, గుంతకల్లు, గుత్తిమీదుగా వస్తున్నటువంటి, తుంగభద్ర ఎగువకాలువ ద్వారా, ఎర్రతిమ్మరాయి చెరువు, పాత, కొత్త చెరువు, నాగసముద్రం చెరువు, గుత్తిఫిర్కా జక్కల చెరువులకు నీటిని సరఫరా చేసే అవకాశము ఏమైనా ఉన్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అన్ని చెరువుల సంగతి చెప్పలేను. గుత్తి చెరువులోకి నీరు వచ్చిన తరువాత, ప్రక్క చెరువులన్నింటికీ నీరు సరఫరా అవుతుంది. గుత్తి చెరువుకు సరఫరా చేస్తున్నాము అని చెప్పాను. తరువాత, అన్ని చెరువులకు సరఫరా చేస్తాము.

*Number of dismissed Sub-Inspectors of Police.*

630—

*847-D Q.—Sri N. SREENIVASA RAO :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :—

the number of Harijan Sub-Inspectors of Police dismissed from service in the year 1955-56 ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

None, Sir.

Sri S. VEMAYYA :—అధ్యక్షా, ఎప్పటినుంచి ఎప్పటివరకు అనేది అర్థంకాకుండా ఉన్నది.

The Hon. Sri N. SANJEEVA REDDI :—మీరు ప్రశ్నచూచుకుంటే అర్థముఅవుతుంది.

*New Building for the Board High School, Potakamuru.*

646—

* 401 Q.—Sri G. YELLAMANDA REDDI .—Will the Hon the Chief Minister be pleased to state .

(a) whether the Government have sanctioned new buildings for the Board High School of Potakamuru, Darsi Taluk, Nellore District ; and

(b) if, so, when the work will be taken up ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, పోటకమూరు హైస్కూలు భవనమునకు వాళ్లు డబ్బుకూడా కట్టారు వెంకటగిరి ఎస్టేటు భవనములు కూడా ఉన్నాయి. అందువల్ల ఆ భవనములు హైస్కూలుకు ఇచ్చే విషయము ఏమైనా ఆలోచనలో ఉన్నదా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—L. D. Works క్రింద చేయబోతున్నాం.

*Silk Farms in the State.*

647—

*799 Q.—SRI P VENKATASUBBAYYA .—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state

(a) the number of Silk Farms in the State ,

(b) the quantity of cotton produced during the year 1954-55 , and

(c) whether the Government allow remissions on such lands under Mulbery to encourage private enterprise in the matter ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Four, Sir.

(b) 1,769 lbs., 8 ozs.

(c) Yes, Sir.

SRI P. VENKATASUBBAYYA :—అధ్యక్షా, చిత్తూరుజిల్లా పలమనేరివద్ద చాలా మలబరీచెట్లు పెంచేందుకు అవకాశము ఉన్నది.అక్కడ silk farm ఏమైనా పెట్టేందుకు ఆలోచిస్తున్నారా?

THE HON. SRI K. VENKATA RAO:—ఎవరు అయినా పెట్టుకుంటే ప్రభుత్వంవారు ఆభూమికి పన్ను తగ్గించె ఏర్పాటుచేస్తారు.

SRI A. KALESWARA RAO :—అధ్యక్షా, ఇదివరకు కొల్లేగాలలో పట్టు పరిశ్రమ బాగా అభివృద్ధి చేసినట్లు తెలుస్తున్నది. అది ఇప్పుడు మైసూరు రాష్ట్రింలోకి పోతున్నది. కమక ఆంధ్రదేశములో ఎక్కడఅయినా ఒక సెంటరు తీసుకొని పట్టు పరిశ్రమను అభివృద్ధి చేస్తారా ? మలబరీచెట్లు పెంచేందుకు ఏమైనా ప్రయత్నం చేస్తారా ? ఇప్పుడు ఎక్కడెక్కడ ఆ పరిశ్రమలు ఉన్నాయి ?

THE HON. SRI K. VENKATA RAO:—ఆంధ్రరాష్ట్రములో 4 మలబరి సెంటర్లు ఉన్నాయి. వారందరికి ఇవ్వవలసిన ప్రోత్సాహము ఇస్తున్నారు. ఉద్యోగస్థులను ఏర్పాటుచేశాము. ఎవరైనా పట్టుచెట్లను పెంచినట్లయితే, ఆ పొలం మీద పన్నులు తగ్గిస్తున్నారు. ఇంకా సహాయం చేస్తాము.

SRI A. KALESWARA RAO :—ఆ నాలుగు ఎక్కడ ఉన్నాయి ?

THE HON. SRI K. VENKATA RAO :—హిందూపురం, పలమనేరు, చింతలగూడి, అరకువాలీలో ఉన్నాయి.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, తూర్పుగోదావరి, అనంతపురం జిల్లాలలో సిల్కుబట్టలు నేసేదానికి విశేషంగా ప్రోత్సాహము ఇచ్చేదానికి సిల్కుబోర్డునుంచి మనకు ఏదైనా గ్రాంటువస్తున్నదా ?

THE HON. SRI K. VENKATA RAO :—నేసేవారు సిల్కుపురుగులను పెంచరు. ఇది పెంచేవారినిగురించి ప్రశ్న.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, మన రాష్ట్రములో ఉత్పత్తి అయ్యే సిల్కు అంతా కూడా సమీకరించి, basic పైన సిల్కుఫ్యాక్టరీ ప్రవేశపెట్టడానికి ఏమైనా ఆలోచనలు ఉన్నాయా ?

THE HON. SRI K. VENKATA RAO :—17,060 పౌనులు, యేడాదికి 6 గురు నేస్తారు. ఇంకా ఎక్కువచెట్లు పెంచేట్లయితే అపని చేయవచ్చును. ధర్మవరంలో సిల్కు వీవర్లను ప్రోత్సహించే ఏర్పాటులు జరుగుతున్నాయి.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, silk farms ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఏమైనా నడుస్తున్నాయా ? లేక ప్రయివేటు యాజమాన్యంక్రింద ఎన్ని ఉన్నాయి ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రయివేటు మానేజిమెంట్లకు ప్రభుత్వమువారి సహాయము ఉన్నది.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, ఈ సిల్కుపరిశ్రమ అరకులోయలో ఉన్నదన్నారు. శ్రీకాకుళంజిల్లా, పాతపట్నం, బరంపురం, టెక్కలిప్రాంతంలో సిల్కు చాలా ఉత్పత్తి అవుతుంది. నేసేవారుకూడా ఉన్నారు. టెక్కలిలో ఏర్పాటుచేయడానికి ప్రభుత్వంవారు ఆలోచిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—గున్నయ్యగారు సంగతులు వినరు. ప్రశ్నలు వేయడంసరదా, అవి సిల్కును పెంచె ప్రదేశాలు, సిల్కుల ఫ్యాక్టరీలులేవు, నేసేప్రదేశాలుకావు. ఇది దానికి సంబంధించిన ప్రశ్నకాదు. గున్నయ్యగారు టెక్కలిలోకావాలంటే టెక్కలిలో పెడతాము. ఎవరైనా సిల్కు ఉత్పత్తిచేసేవారంటే వారికి సహాయం చేస్తాము. ఈ విషయం ఇప్పటికి రెండు పర్యాయములు చెప్పాను.

*Supply of "Ambar Charkas" to the weavers' societies in the State.*

648—

*794 Q.—SRI P. VENKATASUBBAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether "Ambar Charkas" have been supplied to any of the weavers' societies in the State ; and

(b) whether they are superior to the existing looms ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Yes, Sir. Ambar Charkas have been supplied to the following weavers' co-operative societies :—

| Name of the Society. | Ambar sets supplied. |
|---|---|
| (i) Yemmiganur Weavers' Co-operative Society ... ... | 40 |
| (ii) Yadiki Weavers' Co-operative Society... | 20 |
| (iii) Narayanavaram Weavers' Co-operative Society .. ... | 20 |
| (iv) The Perala Weavers' Co-operative Society ... ... | 40 |
| (v) The Mangalagiri Weavers' Co-operative Society ... ... | 40 |
| (vi) The Eluru Weavers' Co-operative Society ... ... | 38 |

(b) The All India Khadi and Village Industries Board has sanctioned pilot schemes at various centres in the country and the results of the experiment have to be awaited before a definite opinion can be given about the working of these charkas.

(a) ఔనండీ.

ఈ క్రింద చెప్పబడిన సహకారసంస్థలకు అంబర్ ఛర్కాలు ఇవ్వబడినాయి. ఎమ్మిగనూరు Weavers Co-operative Society 340, యాడికి 20, నారాయణవరం 20, పేరాల 40, మంగళగిరి 40, ఏలూరు 38 అంబర్ ఛర్కాలు ఇవ్వబడినాయి.

అంబర్ ఛర్కాలనుగురించి ప్రశ్నవేసి "whether they are superior to the existing looms " అని అడిగినారు. Looms కు ఛర్కాకు సంబంధం లేదు.

SRI S. VEMAYYA :—ఈ ఛర్కా ఒక్కొక్కటి ఎంత క్రయం అవుతుందో తెలుసుకోవచ్చునా ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రస్తుతం 71, 72 రు॥లు ఉంటోంది. Mass production మొదలుపెట్టినట్లయితే దీనికి 45, 50 రు॥ల వరకు తీసుకొనిరావచ్చుననుకొంటున్నాను.

SRI G. YELLAMANDA REDDI :—ఇప్పుడు మంత్రిగారు చదివిన వాటిల్లో నెల్లూరుజిల్లాలోని గ్రామాలు లేవండీ ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రతిజిల్లాకు ఇవ్వలేదు. ఒక అరుమాత్రం ఇచ్చినాము. అలాంటప్పుడు ప్రతిజిల్లాలోను ఎట్లా ఉంటాయి ?

SRI SHEIK MAULA SAHEB :—గ్రామాలలో నూలువడికే centres కు ముఖ్యంగా నూలు supply చేయాలని మంత్రిగారన్నారు గ్రామాల లోని మెట్టతాలూకాలలో ఎక్కువగా వడుకుతున్నారు. వారిదగ్గర అంబర్ ఛర్కాల ఖరీదు తీసుకొనిగాని, ప్రభుత్వంతరఫునగాని నూలు సప్లయి చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:—ఇది ప్రస్తుతం పరిశోధన మాదిరిగా సాగుతున్నది మంచిరకం నూలు నేయడానికి వీలవుతుందా లేదా అనేపరిస్థితిలో ఉన్నది. Khadi and Village Industries Board వారు ఖాదీ ఉత్పత్తి అయ్యే ప్రదేశములలో దీనిని చేస్తున్నారు.

Weavers Co-operative Societies బాగా పనిచేసేచోట్లకూడ ఇస్తున్నారు. ఇది విపులంగా పెరిగినతరువాత మనరాష్ట్రమునకు లక్ష అంబర్ ఛర్కాలు వస్తాయి. ఉదయగిరిపట్టుకొని వెళ్లవచ్చును. మౌలానాసాహెబ్ గారు ధరించే బట్టలన్నీ దానిమీదనే తయారుచేయించుకొనవచ్చును.

SRI S. NARAYANAPPA :—ఈ అంబర్ ఛర్కాలను గురించి కొన్ని societies లో పరిశోధనచేస్తున్నామని మంత్రిగారు శెలవిచ్చారు. ఈ పరిశోధనా ఫలితములు ప్రభుత్వానికి అందినాయా ? అందినట్లయితే ఏవిధంగా ఉన్నవో ఒక్కసారి శెలవిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇంకా ఎంతోకాల మవ్వలేదండి. దీనిని 2, 3 నెలల నుంచి చేస్తున్నాము. ఇంకా కొంతకాలం అయిన తరువాతగాని దీని పర్యవసానం తెలియదు.

*Excise Duty on Tobacco.*

650—

***962 Q.—SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state :**

**(a) what is the amount realised by way of Excise Duty on Tobacco in Andhra State during 1954-55 and upto end of December 1955 ;**

(b) on other Excise Duties ; and

(c) the amount allotted to Andhra ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The amount realised by way of Excise duty on Tobacco in 1954-55 and during the period 1—4—1955 to 31—12—1955 is as follows :

| | | |
|---|---|---|
| 1954-55 | ... | ... Rs. 1,49,60,000 |
| 1st April to 31st December 1955 | | ... Rs 1,20,84,000 |

(b) The amount collected on other Excise duties is as shown below :—

| | | |
|---|---|---|
| 1954-55 | ... | ... Rs. 63,42,000 |
| 1st April to 31st December 1955 | | ... Rs. 78,83,000 |

(c) The amount allotted to Andhra out of the divisible Union Duties of Excise in 1954-55 was Rs. 95,64,000. An amount of Rs. 52,14,000 was distributed upto the end of December during the current year.

SRI A. BAPINEEDU :—మన రాష్ట్రంలో పొగాకుమీద పన్ను వచ్చినప్పుడు రెవిన్యూబోర్డు సభ్యులు పాయ్ గారు ఇచ్చిన రిపోర్టులో marketing yards పెట్టమని godowns కట్టమని ఒక రిపోర్టు ఉన్నది. 90 లక్షలకు estimate కూడా ఉన్నది. దీనిని అమలుజరుపుటకు ప్రభుత్వంవారు ఆలోచించారా ?

Mr SPEAKER :—అది కేంద్రప్రభుత్వానిది.

SRI A. BAPINEEDU:—వర్జీనియా పొగాకును గురించి ఒక పాయిప్ రిపోర్టు ఉన్నదండీ. దానిని ప్రభుత్వమునకు ఇచ్చినారు. ఇంతపన్ను వస్తున్నప్పటికీ కూడ దానిని అమలుజరిపినట్లయితే ప్రస్తుతపరిస్థితులలో రైతులకు చాలా నష్టం వస్తున్నది కొన్నికోట్లరూపాయలు నష్టంవస్తున్నది. 90, 88 లక్షలు అయితే ఇది నివారణ అవుతుందని ప్రభుత్వంవారిదృష్టిలో ఉన్నదా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—అది నాకు తెలుసును. Agriculture శాఖను చూచే Minister గారికి వేరేప్రశ్న వేస్తే సమాధానం చెబుతారు

SRI G. NARSIMHAMURTY :—అధ్యక్షా ! ఆ దేశవాళీపొగాకులో తక్కువ కిమ్మత్తు కల్గినటువంటి పొగాకుమ, దానిమీద విధింపబడ్డే పన్నుకంటె

తక్కువగా అమ్మేపొగాకును Excise Department వారు వెంటనే తగులబెట్టి స్తున్నారు. అది బత్తాయి, నారింజ, నిమ్మ మొదలగు తోటలకుమంచి ఎరువుగా ఉపయోగిస్తుంది. కనుక దానిని తగులబెట్టించకుండా ఎరువుగా ఉపయోగించేటట్లు కేంద్రప్రభుత్వానికివ్రాసి అటువంటి ఏర్పాటుచేయిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—వ్రాయమంటే వ్రాస్తాను. కాని ఆ పొగాకుమీద కేంద్రప్రభుత్వమునకు రావలసిన Excise duty రావాలి. అది లేకుండా దానిని విడుదలచేయడానికి వీలుండదు. అందువల్ల జాగ్రత్తగా ఆలోచించి మేము చేయవలసినదేమైనాఉంటే చెప్పండి. వెంటనే చేస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఈ మొత్తంలో I. L. T. D కంపెనీలు చెల్లించే పన్నుకూడాఉందా ? బహుశా అది లేదనే నా ఉద్దేశ్యం.

THE HON. DR. B. GOPALA REDDI :—ఇది మన ఆంధ్ర రాష్ట్రంలోవచ్చిన విషయం. కాని వారు ఏ కలకత్తాకో తీసుకొనిపోయి అక్కడ manufacturing tobacco అంటే అక్కడ ఇంకా పెద్ద మొత్తం చెల్లించాలి. మన రాష్ట్రంలో పోయిన సంవత్సరం వచ్చినటువంటి Excise duty 49 లక్షలు మాత్రమే. కాని manufacturing tobacco అనిచెప్పి ఇక్కడనుంచి ఏ కలకత్తాకో తీసుకొనిపోతే అక్కడ మళ్ళీ ఇంకొక పన్ను కట్టాలి అది దీనిలో కలవదు.

SRI S. VEMAYYA :—ఈ పొగాకుమీద వచ్చేటటువంటి share ఇతర రాష్ట్రములతోటి సమానంగా కాకుండా మనకు ఎక్కువరావడానికి మన ప్రభుత్వం ప్రయత్నంచేస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇది Finance Commission వారు విచారించవలసిన విషయం. ఆదాయంలో 40% రాష్ట్రాలకు ఇవ్వడానికి Finance Commission వారు recommend చేశారు. ఈ సంవత్సరం వచ్చే Finance Commission వారు ఏమైనా ఆలోచిస్తారేమో ! దీంట్లో producing provinces, consuming provinces అని తగాదాలున్నాయి మేము ఎక్కువపికరెట్లు త్రాగుతున్నాము కనుక మాకు ఎక్కువ ఇవ్వాలని ఒక province అనవచ్చు. మేము ఎక్కువ ఉత్పత్తి చేస్తున్నాము కనుక మాకు ఎక్కువ ఇవ్వమనిచెప్పి ఇంకొక రాష్ట్రంవారు అడగవచ్చును. వారు ఇటువంటివన్నీ పరిశీలించి production basis మీద ఇస్తున్నారు, This 40% will be divided among the States on the basis of population,

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా ! మన రాష్ట్రంలో ఉత్పత్తిఅయినటువంటి పొగాకుమీద మొత్తంగా వేసినపన్ను కాదను కొంటున్నాను. అంతేనాండి ?

THE HON. DR. B. GOPALA REDDI :—రెంట్లో రెండు, మూడు రకాల పన్నులున్నాయి. ఆ excise duty లోనే ' excise duty on tobacco realised to Andhra state 4.49 Lakhs ' అయితే సిగరెట్టు ఫ్యాక్టరీమీద వేసేపన్ను వేరేఉన్నది. మళ్ళీ సిగరెట్లుగా తయారైన తరువాత వేసేపన్ను ఉన్నది.

*Ferry working on Ava channel at Thotada.*

651—

* 1077 Q.—SRI B. APPA RAO .—Will the Hon. the Deputy Chief Minister be pleased to state .

(a) whether the Government are aware of the fact that there is no ferry working on Ava channel at Thotada ;

(b) if so, why tolls were fixed ,

(c) whether any petitions protesting the levy and fixation of tolls, were received by the Government ; and

(d) if so, the actiontaken thereon ?

THE HON. SRI N. SANJEEVA REDDI . –

(a) The Government have information that there is a ferry near Thotada on which vehicles etc., are conveyed by boats across ' AVA ' channel.

(b) Does not arise.

(c) Yes.

(d)The matter is under consideration.

SRI E. NAGAYYA :—అధ్యక్షా ! తోటాడ Ferry summer లో నీరు లేనప్పుడు మనుష్యులుదిగి వెళ్ళనప్పుడుకూడా డబ్బు వసూలుచేస్తున్నారు. అది ప్రభుత్వమునకు తెలిసినట్లయితే అట్లు వసూలు చేయకుండా ఉండుటకుగాను orders జారీచేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అది ఇంతకుముందు private ferry గా ఇతరుల స్వాధీనంలో ఉండేది. ఇప్పుడు ప్రభుత్వం తీస్కు

కుంటోంది కనుక ఎలాంటి అక్రమములు జరుగకుండా ఉండుటకు ప్రయత్నం చేస్తుంది,

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—ఈ ferries ను contract కు తీసుకున్నవాడు డబ్బు వసూలుచేస్తాడు. వేరేపడవమీద వెళ్లమంటాడు, పడవవాడు వేరే వసూలుచేస్తాడు.

ఇట్లు నర్సాపురంలో జరిగింది. ఇట్లు చాలా చోట్ల జరుగుచున్నది. అటువంటివి జరగకుండా చేయడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఇప్పుడు అనకాపల్లికి సంబంధించిన ప్రశ్నకు సమాధానం చెబుతున్నాను. నర్సాపురం సంగతి అడిగితే ఎట్లా ? ఇది పూర్తిఅయిన తరువాత నర్సాపురం సంగతి చూద్దాము.

SRI S. VEMAYYA :—ఈ levy ని protest చేస్తూ ఒక నివేదిక ప్రభుత్వమునకు అందింది అన్నారు. ఎప్పుడు అందినది ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Notice.

### *Allotment for the supplementary schemes under Cottage Industries*

652—

* 1018 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether the Government have received additional allotment from the Government of India to an extent of Rs. 32 crores for the supplementary schemes under cottage Industries now ; and

(b) if so, what the schemes contemplated are ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) No such allotment has been received from the Government of India.

(b) Does not arise.

(ఎ) ఈ allotment ఇంకా రాలేదండి. (బి) ఈ ప్రశ్న ఉత్పన్నించదండి.

[27th March 1956

*Instructions to the Inspector-General of Local Administration regarding elections to major Panchayats.*

653—

* 1167 Q.—SRI S. NARAYANAPPA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether the Government have issued instructions to the Inspector-General of Local Administration to postpone elections to major panchayats in our State ;

(b) if not, when are they going to conduct elections to major panchayats ; and

(c) whether the elections to major panchayats in Anantapur District have been postponed ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) No instructions have been issued by the Government for the postponement of elections to Class I panchayats.

(b) Elections to the various panchayats will be held on the dates fixed by the election authority concerned namely the District Panchayat Officer.

(c) Does not arise in view of the answer to clause (a).

*Postponement of the elections to the Major Panchayats.*

654—

* 1118 Q.—SRI P. GOPALU REDDI :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether there is any proposal before Government to postpone elections in the Major Panchayats in the border areas of the State wherever there have been language differences and disputes after the formation of the Andhra State and in view of the reorganisation of States ; and

(b) if so, will the Government propose to appoint special officers for all these Panchayat Boards on the termination of the period of the present boards ?

27th March 1956]

THE HON. SRI. A. B. NAGESWARA RAO :—

(a) There is no such proposal before Government.

(b) Does not arise. But special Officers may be appointed under section 122 of the Madras Village Panchayat Act 1950 for the purpose of reconstitution of panchayats.

SRI. S. NARAYANAPPA .—Major పంచాయతీలలో ఎన్నికలు జరపడానికి ప్రభుత్వం ఉత్తర్వులు ఇచ్చినట్లు మంత్రిగారు శెలవిచ్చారు. జిల్లా బోర్డులకు సలహా సంఘాలు ఏర్పాటుచేస్తే పంచాయతీ ఊళ్లనుంచి member లను తీసుకోవాలని ఉంది. కాబట్టి ఎన్నికలు అయిన తరువాత తీసుకుంటారా ? లేక పోతే ఎన్నికలు జరిగేలోపల నే తీసుకుంటారో మంత్రిగారు శెలవిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—ఇదికూడా ప్రభుత్వం ఆలోచిస్తుంది.

Sri P. GOPALU REDDI .—అధ్యక్షా. తిరుత్తణిలో భాషా ద్వేషాలు పోలేదని, ఈ పరిస్థితులలో elections జరపడం ఉచితంకాదని ప్రభుత్వానికి ఏమైన representations పంపించారా ? పంపించినట్లయితే ప్రభుత్వం ఏ విధంగా ఆలోచిస్తున్నది ? Special Officer ను వేయడానికి ఆలోచిస్తుందా ? లేక ఆ Board ను continue చేయడానికే ఆలోచిస్తుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—నా దగ్గర ఉన్న information ప్రకారం ఇటువంటి representation ఏమి రాలేదు.

SRI P. GOPALU REDDI :—ఆ విధంగా వచ్చినట్లయితే Special Officer ను వేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అది వేరే ప్రశ్న వేస్తే సమాధానం చెప్తాను.

SRI A. YERUKU NAIDU :—అధ్యక్షా, బొబ్బిలి పంచాయతీ బోర్డును మునిసిపాలిటీగా చేయడానికి ప్రభుత్వం notification ఇచ్చారు. దానిని గురించి Election లు ఆపుచేయమని Government Orders ఇచ్చారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO—వేరే ప్రశ్న వేయండి.

[27th March 1956

*Livestock Improvement Board in the State*

655—

* 1152 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

(a) whether there is any Livestock Improvement Board now in the State ; and

(b) if so, the names of non-official members on it ?

THE HON. SRI K. OBULA REDDI :—

(a) Yes, Sir.

(b) The names of the non-official members are as follows :

1. Sri B. Ramachandra Reddy, M.P. Buchireddi-palem, Nellore District.
2. Sri S. B. P. Satyanarayana Rao, B.A., Zamindar of Kapileswarapuram, East Godavari District.
3. Sri G. Sreerama Reddy, President, Panchayat Board and Cattle Breeding Co-operative Society, Chinthaparthi, Vayalpad Taluk, Chittoor District.
4. Sri Alapati Suryanarayana, Govada, Tenali Taluk, Guntur District.

SRI S. VEMAYYA :—ఈ కమిటీ ఎప్పుడు constitute అయినది. ఎప్పుడైన ఒకసారి కూర్చుండా ? కూర్చుంటే ప్రభుత్వానికి ఏమైనా సూచనలు పంపించిందా ? ఆ సూచనలమీద ఏమి చర్య తీసుకొన్నారు.

THE HON. SRI K. OBULA REDDI.—ఈ కమిటీ నూతన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాత ఏర్పడింది. Composite Madras State లో ఉన్నప్పుడుకూడా ఇలాటి కమిటీ ఒకటి ఉండేది. దాంట్లో ఆరుగురు officials, ఆరుగురు non-officials ఉండేవారు. Bifurcate అయిపోయిన తరువాత ఈ కమిటీ ఏర్పడింది. 54 వ సంవత్సరము ఆగష్టునెలలో గోపాలరెడ్డిగారి అధ్యక్షతన ఒకసారి meet అయింది. అక్కడ proceedings అన్నీ pass అయినాయి. మీరు notice ఇచ్చినట్లయితే తక్కిన వివరాలన్నీకూడా తెలియజేస్తాను.

27th March 1956]

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, ఈ non official committee లో రాయలసీమ నుంచి members ఎవరు ఉన్నట్టు లేదు కాబట్టి రాయలసీమకు livestock improvement ఏమి అవసరం లేదని ప్రభుత్వ ఉద్దేశ్యమా ?

THE HON. SRI K. OBULA REDDI :—అది విచారణీయమైన విషయమే. రాయలసీమకుకూడ representation ఇచ్చేదానికి ప్రయత్నిస్తాము

THE HON. DR. B GOPALA REDDI :—చిత్తూరునుంచి ఒకరు ఉన్నారు. నెల్లూరు నుంచి ఒకరు ఉన్నారు. నెల్లూరుకూడా వెంకటేశ్వర సీమలలో చేరుతుంది.

SRI N. K. LINGAM :—అధ్యక్షా, ఈ కమిటీలో హరిజనులు ఎవరూ ఉన్నట్లు లేరు. హరిజనులను ఎవరినైనా వేయడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI K. OBULA REDDI :—ఆలోచిస్తాము.

SRI P. VENKATASUBBAYYA :—ఇప్పుడున్నటువంటి సభ్యులకు పశుపోషణయందు ఏ మాత్రం అనుభవం ఉన్నదో తెలవిస్తారా ?

THE HON. SRI K. OBULA REDDI :—అనుభవం ఉన్నది కనుకనే వారిని వేసుకోవడం తటస్థించింది

SRI A. C. SUBBA REDDI :—ఇప్పుడున్న members అంతా పెద్ద పెద్ద భూస్వాములుగా ఉన్నారు. చిన్న చిన్న భూస్వాములను, live stock పెంచే వాళ్ళను వేస్తే బాగుంటుందేమోనని నా సూచన. ఆవిధంగా చెయ్య గలుగుతారా ?

THE HON. SRI K. OBULA REDDI :—పెద్ద భూస్వాములకు ఎక్కువ విరామం ఉంటుంది. అలాంటి వారిని వేస్తే శ్రద్ధగా పని చేస్తారనే ఉద్దేశ్యంతో వారిని ఈ బోర్డులో వేశారు.

SRI C. SUBBARAYUDU :—ఈ Board యొక్క functions ఏమిటి ? ఇదివరకు ఒకసారి meet అయినట్లుగా చెప్పారు. ఆ meeting లో ఏమి సూచనలు ఇచ్చారు. లేక ఏ improvements కోసం ప్రయత్నం చేశారు ?

THE HON. SRI K. OBULA REDDI :—వేరే ప్రశ్న వేస్తే దాని వివరాలన్నీ తెలియజేస్తాము.

Sri P. VENKATASUBBAYYA :—సభ్యులందరికి అనుభవం ఉన్నదని సెలవిచ్చారు. ఒక్కొక్కరు ఎన్ని రకాల పశువులను, ఎన్ని పశువులను పోషిస్తున్నారో తెలవిస్తారా ?

THE HON. SRI K. OBULA REDDI :—వేరే ప్రశ్న వేయండి.

*Starting of a Milk Powder Factory in the State.*

656—

* 912 Q.—SRI S. VEMAYYA.—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether there are proposals with the Government to start a milk powder factory in the State now ; and

(b) if so, the place at which it will be started now ?

THE HON. SRI. K. VENKATA RAO :—

(a) and (b)

A scheme for the starting of Milk Powder Factories in this State has been included in the Second Five Year Plan of this State. But a scheme has not yet been fully worked out.

రాష్ట్రంలో పాలపొడి పరిశ్రమను తయారు చేసేటందుకు రెండో పంచవర్ష ప్రణాళికలో provide చేయబడి ఉన్నది. ఇంకా scheme పూర్తిగా తయారు చేయలేదు.

Sri C. SUBBARAYUDU :—Milk powder ఫాక్టరి పెట్టడంలో అక్కడ skimmed milk powder తయారుచేస్తారా లేకపోతే అదికూడా wholesome milk powder గానే ఉంటుందా ? అయితే దాని cost ఎంత అవుతుంది.

THE HON. SRI K. VENKATA RAO :—నాకు ఇంకా వివరాలు తెలియవండి. అది అంతా technical matter. అది నాకు బాగా తెలియదు. ఇంకా scheme లేకపోవడంవల్ల నేను సంజాయిషీ చెప్పలేను.

SRI S. VEMAYYA :—పాలపొడి పరిశ్రమను private యాజమాన్యం క్రింద నడుపవలెనా ? లేక ప్రభుత్వమే నడపడానికి ఆలోచిస్తున్నదా ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రభుత్వం అన్ని అక్కల దగ్గర పాలు కిందలేదు.

27th March 1956]

*Indigo Industry in the State.*

657—

* 909 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

whether there are proposals with the Government to intensify the Indigo Industry now in the State ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) No, Sir.

SRI S. VEMAYYA :—నీలిమందు పరిశ్రమ చాలాకాలంగా మన హిందూదేశంలో ఉంటున్నది. ప్రతి గ్రామంలోకూడా నీలి మందు తొట్లు పూర్వం ఉన్నవి. ఇప్పుడు మూసివేయబడినాయి. దీనిని పునరుద్ధరించడానికి ప్రభుత్వం ఎందుకు చర్య తీసుకోలేదు ?

THE HON. SRI K. VENKATA RAO :—Dye stuffs వచ్చిన తరువాత industry పడిపోయింది. అలాగ నష్టపడిన వాళ్లలో మా జిల్లాలో మేము ఒకళ్లము. ఇప్పుడు competition క్రింద vegetable indigo industry నడపడం కష్టం కనుక దానిలో ఎవరు కలుగ జేసుకోవడంలేదు.

SRI M. SATYANARAYANA RAJU :—Foreign నుంచి artificial indigo వస్తున్నది. దానిమీద heavy duty వేయించి natural indigo తయారు చేయడానికి ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—నేనేమి తయారు చేయడం లేదు. గరివిడిలో పెద్ద ఫ్యాక్టరీ పెట్టిస్తున్నారు. Satyanarayanaraju Garu కూడా అలాంటి ఫ్యాక్టరీ పెట్టిస్తే మేము సహాయం చేస్తాము.

*Ferro-Manganese plant at Garividi.*

658—

* 996 Q.—SRI M. SATYANARAYANA RAJU :—Will the Hon. The Minister for Planning and Industries be pleased to state:

(a) whether a licence for starting a Ferro-Manganese Plant at Garividi was granted ;

(b) if so, when it will be commenced ;

(c) the facilities that are proposed for conveyance of the Ferro-Manganese Ore to the factory site ; and

(d) the time that is allowed to Collectors for issuing mining leases ?

THE HON. SRI K VENKATA RAO .—

(a) Yes, Sir.

(b) According to the conditions of the licence issued by the Government of India, the factory should be established by March, 1957.

(c) No definite facilities for conveyance of the manganese ore are proposed as yet. The Company has approached the Government with a request to reserve all the belts of manganese bearing areas for its use and the request is under consideration of the Government.

(d)The Collectors are normally expected to forward the applications received by them for mining leases within a period of two months, unless there are special reasons for taking a longer time for completing the enquiry.

(a) అవునండి.

(b) 1957 వ సంవత్సరం మార్చివాటికి ఈ ఫ్యాక్టరీ తయారు కావలెనని Government of India వారు నిర్ణయించారు. వాటికి కావలసినంత సహాయం చేయవలసిందని కొన్ని భూములు వారికి ప్రత్యేకంగా ఇవ్వవలసిందని Government వారికి ఈ firm వారు ధరఖాస్తు పెట్టి ఉన్నారు. ఇలాంటి ధరఖాస్తు లన్నింటిని కలెక్టరు పరిశోధనచేసి ప్రభుత్వంవారికి పంపించేటటువంటి ఏర్పాటుకూడా ఉన్నది.

SRI M. SATYANARAYANA RAJU :—ఇప్పుడు ఈ factory కడుతున్నారు. అక్కడకు ఇతర ఊళ్ళనుంచి రావడానికి routes convenient గా లేవు. దానివిగురించి ఏమి ఏర్పాటు చేస్తున్నారు ?

THE HON. SRI K. VENKATA RAO:—ఫ్యాక్టరీ కడితే చుట్టు పట్ల అంతా ఊరే.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఈ ఫ్యాక్టరీకి ఎంత డబ్బు అవుతుంది. దానిలో ప్రభుత్వపు వాటా ఎంత ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రభుత్వం వాటా ఏమి లేదు. దానికి 150 లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టవలసి యుంటుంది,

SRI E. NAGAYYA :—అధ్యక్షా, మాంగనీస్ గనులు త్రవ్వడానికిగాను చాలమందికి లైసెన్సులు ఇస్తున్నారు. ఆ లైసెన్సులు తీసుకొన్నవారు mines ను excavate చేస్తున్నారు. లేకపోతే కొంతలాభం తీసుకొని ఏ companies కైనా ఇచ్చి చేయిస్తున్నారు.

Mr. SPEAKER :—గరివిడికి సంబంధించిన ప్రశ్న ఇది.

THE HON. SRI K. VENKATA RAO :—ఈ ప్రశ్న దీనికి సంబంధించినది కాదు. గరివిడిలో Ferro Manganese Factory పెట్టడంగురించి మాట్లాడుతున్నాం. అక్కడ mines ఎలా పనిచేస్తున్నాయి అనేటటువంటి విషయానికీ, ఫ్యాక్టరీ పెట్టడానికి సంబంధంలేదు.

SRI M. SATYANARAYANA RAJU :—Manganese ore 10, 12 లేక 15 మైళ్ళనుంచికూడా రావలసి వస్తున్నది. దానిని లారీలలో తీసుకువచ్చేటప్పుడు రోడ్లు సరిగాలేక గతనెలలో మూడు ప్రమాదాలు జరిగినాయి. అది ప్రభుత్వానికి తెలుసునా?

THE HON. SRI K. VENKATA RAO :—ఖానీలు ఎవరు చేశారో ఏమో మా record లో లేదు. అది కేవలం మీరు అంటున్నమాట. Accidents అనేవి first class రోడ్లు వేసినటువంటి బెజవాడ, జగ్గయ్యపేట మధ్యన ప్రతిరాత్రి ఒకటి జరుగుతోందని ప్రతీతి.

SRI M. SATYANARAYANA RAJU:—Mining lease ఇవ్వడం చాలా ఆలస్యమవుతున్నది. అది త్వరగా ఇచ్చేటట్లు కలెక్టరుకు ఉత్తరువులు ఇస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఒక పెద్దమనిషి ఈ విధంగా చెప్పారు. "నేను I. C. S. Officer ను, mining నా charge లో ఉండినప్పుడు నేను cycle మీద ఆఫీసుకు వెళ్ళేవాడిని, మా ఆఫీసు superintendent రోజూ కారులో వెళ్ళేవాడు" అని. కనుక ఇది చాలా జాగ్రత్తగా చూడవలసినటువంటి విషయము. Lease అడుగుతూనే ఇచ్చేటటువంటి పరిస్థితి ఉంటే, దేశానికి చాలా నష్టమువస్తుంది.

SRI C. SUBBARAYUDU :—ఈ Second Five Year Draft Plan లో, ముఖ్యమైనటువంటి ఖనిజములను ప్రభుత్వమే excavate చేయాలని ఉన్నది. అందువల్ల mining licences ఇకమీదట issue చేయకుండా చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO .—వారికి అది ఎక్కడ కన్పించిందో నాకు తెలియదుగాని, national policy లో అన్ని mines లోను ప్రభుత్వమే పనిచేయాలనే నిర్ణయంలేదు. ఇదివరకు ఒక coal విషయములో చేస్తామని అనుకొంటున్నాము. అదికూడ ఇంకా సఫలీకృతంకాలేదు. అందువల్ల ఆ కార్యక్రమములో ఇది భాగముకాదు.

SRI B. G. M. A. NARASINGA RAO:—అధ్యక్షా, Ferro Manganese plant కు hydel power మనము ఎంతకాలములో supply చేయగలమో తెలియజేస్తారా.

THE HON. SRI K. VENKATA RAO: —మార్చి 1957 వరకు, factory పనులకు గడువున్నది. కనుక ఆలోపుగానే hydel supply చేయడానికి ప్రభుత్వము అంగీకరించింది.

*'Grading Scheme' for sheep mutton.*

659—

* 1137 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

(a) whether the ryots of Nellore District are aware of 'Grading Scheme' for Sheep mutton now ; and

(b) the places at which this scheme is working now in the State ?

THE HON. SRI K. OBULA REDDI :—

(a) No, Sir.

(b) The scheme is working now at Ganapavaram of Vijayawada Taluk in Krishna District.

(a) లేదండి

(b) గనపవరం గ్రామంలో అమలు జరుపబడుచున్నది.

SRI. S. VEMAYYA :—ఈ scheme రాష్ట్రవ్యాప్తంగా చేయడానికి ఏదైనా ఆలోచన ఉన్నదా? ఈ scheme వల్ల private గా ఏదైనా subsidy ఇస్తున్నారా?

THE HON. SRI K. OBULA REDDI :—ప్రస్తుతము ఈ పని రాష్ట్రవ్యాప్తంగా జరగడంలేదు. ఒక్క విజయవాడ తాలూకాలో గనపవరం అనే గ్రామానికి మరొక గ్రామానికి ఇది పర్యాప్తంచేశారు. ఇక్కడవేరే మందిరక్షు

27th March 1956]

గొర్రెలను తీసుకవచ్చి నాచురకపు గొర్రెలతో కలపి అభివృద్ధిచేస్తున్నారు; రాష్ట్ర వ్యాప్తంగా ఇది చేయవలెనా, లేదా అనేది ఆలోచించాలి.

SRI S. RANGANATHA MUDALIAR .—May I now what this grading scheme is, and how it works, sir !

THE HON. SRI K. OBULA REDDI :—Grading అంటె మేలు రకపు పోతులను తీసుకువచ్చి నాచురకపు గొర్రెలతో కలిపిస్తారు అన్నమాట. అప్పుడు మేలురకపు జాతి తయారవుతుంది.

[*Note* .—An asterisk *at the commencement of a speech denotes revision by the Member.]

## II. BUDGET FOR THE YEAR 1956-57—(contd.)

## VOTING OF DEMANDS FOR GRANTS FOR 1956-57—(contd.)

### (1) DEMAND No. XXVII—ELECTRICITY.

### (2) DEMAND No. XL—CAPITAL OUTLAY ON ELECTRICITY SCHEMES.

THE HON. SRI G. LATCHANNA .—Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move :

> "That the Government be granted a sum not exceeding Rs. 1,08,94,600 under Demand No. XXVII—Electricity".

> "That the Government be granted a sum not exceeding Rs. 11,92,42,000 under Demand No. XL—Capital Outlay on Electricity Scheme.

అధ్యక్షా, Demand XXVII క్రింద 1,08,94,600 రూపాయలకున్న, Excise Demand క్రింద 11,92,42,000 రూపాయలకున్న మించకుండా అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను. ఈ రెండు Demands ఒకేమారు ప్రతిపాదించడానికికూడ అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను. ఎందువల్ల నంటె, మొత్తము ఈ electricity యొక్క ఉత్పత్తి, దానియొక్క నిర్వహణ, సరఫరా మొన్నగు వాటినన్నిటిని గురించి సమగ్రంగా చర్చించడానికి మనకు అవకాశముంటుందని ఆశిస్తున్నాను. మన Andhra State formation అయిన తరువాత, ఇంతవరకు, మనము అయిదు zones లో ఈ electricity

Sri G. Latchanna] [27th March 1956

సరఫరా జరిపిస్తున్నాము—అవి (1) మాచ్‌ఖండు, (2) తుంగభద్ర, (3) నెల్లూరు, (4) చిత్తూరు, (5) హిందూపురము, ఈ అయిదు భాగాలుగా మనము electricity సరఫరా చేస్తున్నాము ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఈ electricity ఉత్పత్తి గురించి 24 కోట్ల, 25 వేల రూపాయలు కేటాయించబడింది. ఇది Power projects కు సంబంధించినటువంటి allotment అని సభ్యులు గమనిస్తారని నేను ఆశిస్తున్నాను. మనకు Andhra State ఏర్పాటేసరికి మనము ఉత్పత్తిచేస్తున్నటువంటి Steaming power ద్వారా, 16,200 కిలోవాట్లున్నూ, Diesel sets ద్వారా 5,150 కిలోవాట్లును మనము electricity ఉత్పత్తి చేసుకొంటున్నాము. అంతేకాక, మన Hydro-power మద్రాసునుండి, మైసూరునుండి కొనడం జరుగుతున్నది. మైసూరునుండి 2,700 కిలోవాట్లును, Jog power నుండి 700 కిలోవాట్లును, కొంటున్నాము. మద్రాసునుండి 3,400 కిలోవాట్లు కొంటున్నాము. ఈ విధంగా మొత్తము 27,510 కిలోవాట్లగల శక్తి ఆంధ్రరాష్ట్రము స్థాపన అయ్యేసరికి, మన రాష్ట్రములో ఉత్పత్తి అవుతున్నది. దాని ననుసరించి సుమారు 317 గ్రామాలకు మాత్రము electricity సరఫరా జరుగుతున్నది. ఈ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం అయినతరువాత, సుమారు 14,435 కిలోవాట్లశక్తి అదనంగా ఉత్పత్తి చేయబడింది. దానివల్ల మొత్తంమీదను 35,845 కిలోవాట్ల శక్తిని మనము ఉత్పత్తి చేసుకొంటూ, మైసూరునుంచి, మద్రాసునుంచి కొనుకొన్న శక్తివల్ల మనము ఈ electricity సరఫరా సాగించుకొంటున్నాము. దీనివల్ల, 31 మార్చి 1955 నాటికి మన Per capita consumption పదియూనిట్లవరకు అభివృద్ధి పరచబడింది. కొబట్టి Second Five Year Plan ఆఖరుకి మన ఉత్పత్తి 1,23,300 కిలోవాట్లువరకు చేసుకొని, తద్వారా Per capita వినియోగము 20 Units వరకు పెరగగలదని మనవిచేస్తున్నాను. ఇదివరకు ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కేంద్రప్రభుత్వము గ్రామీణ ప్రాంతాలకు electricity సరఫరా గురించిన్నీ, తరువాత ముఖ్యంగా employment facilities అనే పద్దుక్రిందనూ 1,27,82,300 రూపాయలు loan మనకు sanction చేయడమూ, అందులో మనము 1954-55 లో 25 లక్షలు ఖర్చుపెట్టడమూ జరిగింది. 1955-56 లో ఒక కోటి, మూడులక్షల రూపాయలు ఖర్చుపెట్టాము. తరువాత, ఇటీవలనే మిగతా 16 స్కీములుకూడ కేంద్రప్రభుత్వము ఆమోదిస్తూ మనకు మిగిలిఉన్నటువంటి 39 లక్షల రూపాయలు దానిక్రింద ఖర్చుపెట్టుటకు కేంద్ర ప్రభుత్వం వారు ఆమోదము తెలియజేశారు. మన రాష్ట్రములో మనకు రెండుకోట్ల power-projects నిర్మాణం జరుగుతున్నవి. అవి (1) మాచ్‌ఖండు, (2) తుంగభద్ర.

27th March 1956] [Sri G. Latchanna

ఇదివరకు మనము నిర్మాణం చేస్తున్నటువంటి power projects లో మాచ్‌ఖండు పెద్దది. అది first stage పూర్తిఅయ్యేసరికి 51,000 కిలోవాట్లశక్తిని ఉత్పత్తి చేయగలుగుతుంది. Second stage లో మరి 51,000 కిలోవాట్లు ఉత్పత్తి చేయగలుగతుంది. మొత్తము 1,02,000 కిలో వాట్లశక్తి ఈ మాచ్‌ఖండ్‌వల్ల ఉత్పత్తి అవుతుంది. అందులో నూటికి 30 వంతులు ఒరిస్సా ప్రభుత్వానికిపోతే, మిగతా 75, వేలు చిల్లర ఉత్పత్తిని మన ఆంధ్రరాష్ట్రము వినియోగించడానికి అవకాశముంటుంది. ఈ Project నిర్మాణం పూర్తిఅయ్యేసరికి, ఆంధ్రప్రభుత్వము 11,50,00,000 రూపాయలు దానిక్రింద ఖర్చుపెట్టవలసియుంటుంది.

గత ఆగస్టు 18 వ తేదీ మన రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారిచేత మచ్‌ఖండ్ ప్రాజెక్టులో electricity ఉత్పత్తికి, సిటిసరఫరాకు ప్రారంభోత్సవము చేయబడిన సంగతి అందరికీ తెలిసిన విషయమే. ఆ ప్రాజెక్టువద్ద electricity ఉత్పత్తి కోసము రెండు turbines పనిచేస్తున్నవి, దానివల్ల 34,000 K. W. శక్తిగల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుచున్నది. అయితే ఒరిస్సా రాష్ట్రమువారి tower line construction పూర్తికానందువల్ల వారికి మన ప్రభుత్వము royalty చెల్లించి, ఆ శక్తిని అంతా మనమే ఉపయోగించుకునే అవకాశము కలిగింది. తరువాత యిక్కడ తుంగభద్ర ప్రాజెక్టువద్ద విద్యుచ్ఛక్తి సరఫరాకు ఏర్పాటులు జరుగుచున్నవి. ఆప్రాజెక్టుయొక్క power project కు సంబంధించినంతవరకు 3.63 లక్షల రూపాయలకు estimates తయారుచేయబడినవి. ఇందులోని పనులు first stage లోనివి, second stage లోనివి అన్ని పనులుకూడ ఉత్పత్తికోసము డిశంబరునాటికి పూర్తికాగలవని, ఉత్పత్తి ప్రారంభమవుతుందని ఆశిస్తున్నాము. మొదటి turbine వల్ల 17000 K. W. శక్తిగల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తికావటానికి అవకాశము ఉంటుందని ఆశిస్తున్నాము. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మనకు యింకొక పెద్ద ప్రాజెక్టును కట్టించుకోటానికి కేంద్రప్రభుత్వంవారు ఆమోదించారు. దానిపేరు శీలేరుప్రాజెక్టు. ఈ ప్రాజెక్టును preliminary investigation స్థలనిర్ణయము, యింకా యితరపరిశీలనలు అన్నీ కేంద్రప్రభుత్వంవారు యిటీవలనే చేశారు. దానిని ప్రారంభించటానికి కేంద్ర ప్రభుత్వంవారు ఆమోదించారు. విద్యుచ్ఛక్తి సరఫరాగురించి మన ప్రభుత్వం అవలంభిస్తున్న priority విధానము సభ్యులకందరికి తెలిసినవిషయమే. ప్రప్రథమముగా industries కు కాకుండా, గ్రామీణప్రాంతాలలో వ్యవసాయాభివృద్ధికిగాను first priority యివ్వడమవుతున్నది. ఇవిగాక మెట్టప్రాంతాలలో ప్రత్యేక సదుపాయములుకూడ

Sri G. Latchanna] [27th March 1956

కలిగించటానికి ప్రభుత్వము కృషిచేస్తున్నది. కాని సభ్యులలో కొంతమంది, కొన్ని కొన్ని ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి ఎక్కువగా సరఫరాచేస్తున్నట్లునూ, కొన్ని ప్రాంతాలలో తక్కువగా చేస్తున్నట్లునూ, అపోహలు, అనుమానాలు ఉన్నట్లు సూచనలు అక్కడక్కడ ఒకపక్షమువారిలో కనబడుతున్నవి. కాని ఈ విద్యుచ్ఛక్తి సరఫరాచేసేటప్పుడు, యిందులోగల సాధకబాధకాలు కొన్ని ముఖ్యమైనవి సభ్యులు దూరదృష్టితో గమనించినట్లయితే వారిలో ఉన్నటువంటి అపోహలు, అనుమానాలు సరియైనవికావు అనేది వారే తెలుసుకోగలరని నా అభిప్రాయము. ఒక్క విషయముమాత్రము చెబుతున్నాను. ఎక్కడైతే విద్యుచ్ఛక్తి కొరకు power ఉత్పత్తి అవుతున్నదో దాని పరిసరప్రాంతాలలో power ను సరఫరా చేయడమువల్ల, ప్రభుత్వానికి ఆర్థికంగా లాభిస్తుందని నేను ప్రత్యేకంగా చెప్ప పనిలేదు. Power station కు దగ్గరగా లేనటువంటి ప్రాంతాలకు పవరును నాలుగురెట్లు, అయిదురెట్లు, ఆరురెట్లవరకూ సప్లయిచేయవలసి వచ్చినందువల్ల కొన్ని దూరపుప్రాంతాలలో సప్లయి వెలితిగా కన్పించడముకద్దు. ఇది సహజమే. మరి కొన్నిప్రాంతాలలో ఎక్కువగా సప్లయికావడము కన్పిస్తుంది దీనివల్ల కొన్నిప్రాంతాలలో ప్రభుత్వము ఎక్కువశ్రద్ధ చూపుతున్నదనిగాని కొన్నిప్రాంతాలలో తక్కువ శ్రద్ధచూపుతున్నదనిగాని అనుకోవడము సరియైనదికాదని మనవిచేస్తున్నాను. ఇదిగాక మనప్రభుత్వానికి ఉన్నటువంటి ఆర్థికదుస్థితివల్ల, విద్యుచ్ఛక్తి సరఫరాను గురించిన క్లిష్టసమస్యను ప్రభుత్వము ఎదుర్కోవలసి వస్తుంది. మన ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితి కొన్ని నిబంధనలతో కూడుకుని ఉన్నందువల్ల, విద్యుచ్ఛక్తి సరఫరా కొన్ని limitations కు లోబడి చేయవలసివస్తున్నదనేసంగతి వేరేచెప్ప నవసరము లేదు. ఇదిగాక దీనికి మరొక కారణముకూడ ఉన్నది. విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయటానికి కావలసిన వస్తుసామగ్రి, ముఖ్యంగా copper conductors గాని, transformers గాని కావలసినన్ని సప్లయి కాకపోవడమువల్లగూడ విద్యుచ్ఛక్తి ఎక్కువగా ఉత్పత్తిచేసుకోటానికి అవకాశములేకుండా పోతున్నవి. ఆర్థిక యిబ్బంది ఒకప్రక్కన, వస్తుసామగ్రి సప్లయికాకపోవడము మరొకప్రక్కన బాధించడమువల్ల విద్యుచ్ఛక్తిని తగినంత తయారుచేసుకోటానికి అవకాశము లేకపోవడము జరుగుచున్నది. ఇటువంటి క్లిష్టపరిస్థితులు ఉంటున్నప్పుడు మనకు ప్రత్యేకరాష్ట్రము ఏర్పడినతరువాత ప్రభుత్వము శ్రద్ధచూపుతున్నదో, అశ్రద్ధచూపుతున్నదో, మనము ఇంతవరకు చేసిన అభివృద్ధినిబట్టి తెలుసుకోవచ్చును. ప్రభుత్వము విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలోగాని, వీలు ఉన్నంతవరకు సరఫరాచేయడములోగాని, ఏలాంటి మందకొడితనమూ పక్షపాతము లేదు. ఆ విధముగా భావించడము చాలా అన్యాయము

27th March 1956] [Sri G. Latchanna

అంటున్నాను. మనకు ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత మనము ఎంత అభివృద్ధి చేశామో, యీ దిగువ లెక్కలే తార్కాణమని అంటున్నాను. మనకు రాష్ట్రము ఏర్పడినప్పుడు మనకు యిచ్చిన extension schemes యొక్క సంఖ్య 108. రాష్ట్రము ఏర్పడి యిప్పటికి దాదాపు 2½ సంవత్సరములు కావచ్చింది. ఈ 2½ సంవత్సరములలో యీ 108 స్కీములమీద ప్రభుత్వము ఖర్చుచేసినసొమ్ము 2,51,34,320 రూపాయలు. 1955 వ సంవత్సరము మార్చి 31 వ తేదివరకు మనకు మొదట్లో యిచ్చిన 108 extension schemes గాక, యింకా 111 extension schemes అమలుపరచబడినవి. వీటికి ఖర్చు మొత్తము సుమారు ఒకకోటి యాభైమూడులక్షలదాకా అయింది. ఈ మొత్తము యీ స్కీమ్సు అన్నింటిమీదనే ఖర్చుచేయబడినది. ఆంధ్రరాష్ట్రము ఏర్పడేసమయానికి విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్నగ్రామాలు 317. రాష్ట్రము ఏర్పడినతరువాత యిప్పటివరకూ యింకా 273 గ్రామాలకు విద్యుచ్ఛక్తి మనము సప్లయిచేయగలిగాము. దీనివల్ల యిప్పటికి విద్యుచ్ఛక్తి సరఫరా అయ్యేగ్రామాల మొత్తము 590 వరకూ పెరిగిందని మనవి చేస్తున్నాను. ఇదిగాక, mileage లెక్కలనుబట్టి మనము నిర్మించుకున్న high tension lines కాకుండా, power stations, main lines, గ్రామాలకు సరఫరాచేసే low tension lines యొక్క నిడివి అంతా కలిపి 2,400 మైళ్లు అయింది. ఈ లెక్కలనుబట్టి, మన ప్రభుత్వానికి ఉన్నటువంటి ఆర్థిక దుస్థితినిబట్టి మనము యింత progress చేయగలిగామంటే, అది సంతోషించతగ్గ విషయము. మనము అభివృద్ధిచేసుకోగలిగినదానికంటే, ఎక్కువే అభివృద్ధిచేసుకున్నాము. ఇంత కంటే అవకాశము లేకపోయింది. అందువల్ల ప్రభుత్వము యీ విద్యుచ్ఛక్తి విషయములో మందగొండితనము గాని, అశ్రద్ధగాని చూపుతున్నదని అనుకోవడము పొరబాటు అంటున్నాను. ఈ విషయము ప్రతిఒకసభ్యుడు గమనిస్తారని ఆశిస్తున్నాను. ఇక పోతే power stations కు అందుబాటులోవున్న గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాసంగతి ఏమిటి అనే ప్రశ్న ఒకటి ఉన్నది. దీనికి నేను సమాధానము ఒక్కటే చెబుతున్నాను. ప్రభుత్వము అవలంభించే విధానము సభ్యులకు యిదివరకే మనవి చేశాను. దానిని అనుసరించి చిన్నచిన్న power stations, diesel stations ముందు తాలూకా కేంద్రాలలో ఏర్పాటుచేసి, అక్కడనుంచి main lines ద్వారా గ్రామీణ ప్రాంతాలకు సరఫరా చేయాలనే విధానము ప్రభుత్వము యిదివరకే ప్రకటించింది. ఈ విధానమునుబట్టి తాలూకా కేంద్రాలనుంచి గ్రామీణ ప్రాంతాలకు విద్యాచ్ఛక్తి సరఫరా అయినప్పుడు, యిది వ్యవసాయాభివృద్ధికి తోడ్పాటవుతుంది. వ్యవసాయానికి first priority యిస్తామని యిదివరకే మనవిచేశాను.

Sri G. Latchanna] [27th March 1956

తరువాత industries కొరకు గత 2½ సంవత్సరాలుగా 14,200 H P గల విద్యుచ్ఛక్తి అదనముగా సరఫరాచేయబడుతున్నది. వ్యవసాయమునకు గూడ 14,200 H. P. గలశక్తి సరఫరాచేయబడుతున్నది. ఈ వివరాల విషయములో సభ్యులకు ఏదైనా సందేహముఉంటే, అది నిరాధారమైనదనే చెప్పగలను. విద్యుచ్ఛక్తిని యింకా అదనముగా ఉత్పత్తి చేయాలనే ఉద్దేశముతో, దీనిని రెండు భాగములుగా విభజించాము. Rayalaseema Power system అని, Andhra Power System అని ఏర్పాటుచేశాము. అయితే ఈ రెండు భాగములుకూడ ఒకే grid క్రింద మన ఉత్పత్తిని అభివృద్ధి పరచుకున్నప్పుడు దీనిని మరింత ద్విగుణీకృతముగా సప్లయి చేసుకోటానికి వీలు ఉంటుంది. అప్పుడు ఉత్పత్తిచేసుకొని గ్రామీణ ప్రాంతాలకు సరఫరా చేయటానికి వీలు అవుతుంది. విద్యుచ్ఛక్తి శాఖకు 1956-57 బడ్జటు ప్రకారము allot అయిన సొమ్ము మొత్తము 5,69,46,000 రూపాయలు విద్యుచ్ఛక్తి కొరకు యింత వరకు రాష్ట్రములో ఉన్న డిమాండునుబట్టి వచ్చే ఏడాదిలోగా చేయవలసిన కార్యక్రమాలనుబట్టి, యీ సొమ్ము చాలదనే నా అభిప్రాయము. ఈ విషయము మొన్న జరిగిన మంత్రివర్గ సమావేశములో మరల చర్చించబడింది. గరివిడిలో ఒక Ferro-manganese factory ను గూడా ప్రభుత్వం ప్రారంభించబోతున్నది. దానికి విద్యుచ్ఛక్తి సరఫరాచేయవలసి యున్నది. అందువల్ల మంత్రివర్గసమావేశములో యీ విషయము దృష్టిలో పెట్టుకుని మనకు 1956-57 సంవత్సరపు బడ్జటు ప్రకారము యిచ్చిన allotment కాక యింకా అదనముగా 75 లక్షలు allot చేయటానికి నిర్ణయించబడింది.

అదీగాక నందికొండ project కుగాను సుమారు 96 లక్షలరూపాయిలు ఖర్చుపెట్టి కొత్త lines వేసి electricity సరఫరాచేయవలసియున్నది. దానికి డబ్బు చాలదని, గ్రామీణప్రాంతాలకు electricity సరఫరా ఆపివేయకుండా ఉండాలనే సంకల్పంతో ప్రభుత్వం నాగార్జునసాగర్ Control Board వారితో చర్చించి Control Board వారి తీర్మానంపై, Nagarjuna Sagar Control Board funds నుండి ప్రత్యేకంగా 96 లక్షలరూపాయిలు అదనంగా loan ఇప్పించవలసినదని కేంద్రప్రభుత్వానికి తెలియజేయడమైనది. మనకు ఇంకా పెద్ద project ల నిర్మాణం ఉన్నది. కడపనుండి నెల్లూరుకు ఒక main line నిర్మాణం తొందరగా చేయవలసిన అవసరం ఉన్నది. ఆ line నిర్మాణం పూర్తి అయితేగాని మన Andhra State grid ను complete చేసే అవకాశం ఉండదు. దానిక్రింద సుమారు 80 లక్షలరూపాయిలు ఖర్చుకావలసియుంటుంది. ఈవిధంగా పెద్దపెద్ద

మొత్తాలు ఖర్చు ఉన్నందువల్ల మన ఎలాటుమెంటును పెంచడానికి permission ఇవ్వాలనీ, loan కూడా ఇప్పించవలసినదని కేంద్రప్రభుత్వానికి మన ప్రభుత్వం తెలియజేసియున్న సంగతి ఆ విషయమై జరిగిన చర్చలవివరాలతో సహా పత్రికలలో సభ్యులు చూచి ఉంటారని తలచెదను. Electricity scheme ల వివరాలు క్లుప్తంగా మనవిచేశాను. ఇందులో 1 కోటి 8 లక్షలు ఈ Department యొక్క administration ఖర్చుకు సంబంధించినపద్దు. మిగతాది మన capital outlay కి సంబంధించినపద్దు. ఈ రెండుపద్దులూ సభ్యులందరూ సాకల్యంగా పరిశీలించి ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతున్నాను.

Sri R. B. Ramakrishna Raju :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 1,08,94,600 for Electricity by Rs. 100.

(To discuss the need for extension for agricultural purposes in Chittoor District).

Sri Vavilala Gopalakrishnayya :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 1,08,94,600 for Electricity by Rs. 100.

ఫిరంగిపురం, నర్సారావుపేట లైను పూర్తిచేసి సత్తెనపల్లి తాలూకాలో పాసుకుపాడు, వొర్నిపాడు, లక్కరాజా గార్లపాడు, ముప్పాళ్ల, గొళ్లపాడు, మాదల గ్రామాలకు శివారులలో విద్యుచ్ఛక్తి వ్యవసాయానికి యిప్పించవలసిందిగా.

Sri Pillalamarri Venkateswarlu :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 1,08,94,600 for Electricity by Rs. 100.

(To discuss the failure of the Government to make arrangements to supply electrical energy in Munagala Paragana, Nandigama Taluk).

(No cut motions under Demand No. XL).

Mr. Speaker :—The main Demands and the cut motions are now before the House for discussion.

[27th March 1956

SRI R. B. RAMAKRISHNA RAJU:—మహాశయా ! ఈ electricity పద్దుమీద కొన్ని విషయాలు గవర్నమెంటువారి దృష్టికి తీసుకురావాలనే ఉద్దేశ్యంతో నేను యీ కోతతీర్మానం పెడుతున్నాను. ఈ electricity విషయంలో మనరాష్ట్రంలో చాలాగొప్పపని జరిగింది. ఇది అందరూ ఒప్పుకోవలసినదే. 1939 వ సంవత్సరంనుంచికూడా మనరాష్ట్రంలో electricity విశేషంగా వ్యాప్తం కావాలని ప్రయత్నం చేసినవారిలో నేను ఒకడను. అప్పుడు ప్రభుత్వం రాజీనామా ఇచ్చినమూలంగా ఏమీ పని జరగకుండా పోయింది. పిమ్మట 1946 మొదలు 1952 సంవత్సరంవరకూ ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ఉన్నంతవరకూ అనేకవిధాల ప్రయత్నంచేసి అర్జీలు ఇచ్చుకుని, conferences పెట్టి ఆందోళన చేసినా ఏమీ పని జరగలేదు. 1952 వ సంవత్సరం జనవరిలో కొన్ని schemes ముఖ్యంగా మా ప్రాంతానికి చెందిన schemes అన్నీ అప్పుడు sanction చేశారు. అప్పుడు రేణిగుంట మొదలు కాళహస్తివరకూ అరకోణంనుంచి రేణిగుంట వరకూ సుమారు 45 లక్షల scheme ఒకటి, 10 లక్షల scheme ఒకటిఅక్కడనుండి branch lines నగరినుండి పల్లిపట్టువరకూ పుత్తూరునుంచి కార్వేటునగరు వరకూ ఇవన్నీకూడా1952లో sanctionచేశారు.పిమ్మట 1952లో కాంగ్రెస్ ప్రభుత్వందెబ్బతినడం,తరువాతరాజగోపాలాచారిగారిమంత్రివర్గం ఏర్పడడం ఆయనడబ్బువిషయంలో చాలా గట్టిపట్టు పట్టడం, అందువల్ల 1952 లో sanction అయిన ఈ schemes అన్నీ ఏవీ జరగలేదు. 1953 లో మన ప్రభుత్వం ఏర్పడిన తరువాత electricity schemes కు చాలా ప్రాముఖ్యం ఇచ్చి మా ప్రాంతంలో electricity చాలావ్యాప్తిచేసినందులకు ప్రభుత్వంవారిని అభినందిస్తున్నాను. ఐతే ఒకవిషయంచెప్పదలచుకున్నాను. ఇప్పుడు 300 గ్రామాలకేవున్నది, దాన్ని 500 గ్రామాలకు ఇవ్వాలనుకుంటున్నామని మంత్రిగారుసెలవిచ్చారు. ఇది నిదానంగా జరుగుతుందేమోనని నా మనస్సులో సంకోచంగాయున్నది. పెద్ద పట్టణాలలో electricity ఉంటూనే ఉంది. గ్రామాదులలో ముఖ్యంగా ఎందుకు కావాలంటే, అక్కడ వ్యవసాయానికీ, ఇతర చిన్న చిన్న పరిశ్రమలకూ ఉపయోగపడుతుంది. కావాలని అడుగుతున్నాం. మా ప్రాంతంలో electricity ఇచ్చినచోటంతా గ్రామాదులలో కూడా light లకే ఇచ్చియున్నారు. నా మనవి ఏమంటే దీపాలంతముఖ్యం కాదు. వ్యవసాయానికి కావలసిన నీరుతోడే ఉపకరణానికి దీన్ని ముఖ్యంగా ఉపయోగించేటట్లుగా ఎంతత్వరగా ప్రభుత్వం ప్రయత్నంచేసి ఇస్తే అంత బాగుంటుందని నా మనవి. ఇప్పుడు పల్లిపట్టు, కార్వేటినగర్, నగరి ఈ ప్రాంతాలలో అంతా దీపాలకూ కొన్నిచోట్ల మాత్రం వ్యవసాయానికి ఇచ్చియున్నారు. మాప్రాంతంలో

27th March 1956] [Sri R. B. Ramakrishna Raju

ఇంకా వ్యవసాయానికి ఇవ్వలేదు. ఇవ్వవలసిందని అనేకవిధాలుగా మేము అర్జీలు వ్రాసుకున్నాం. మాదగ్గరనుంచి applications తీసుకునిపోయి సుమారు ఒక సంవత్సరం అయినది. ఈసంవత్సరం చేయమని అడిగితే engineer గారు ఈ March లోపల చెయ్యడానికి డబ్బులేదని, పైసంవత్సరం అనగా 1956-57 లో ఖండితంగా చేస్తామని చెప్పారు. అది ఎంతవరకూ సాధ్యమో నాకు తెలియదు. నేను మంత్రిగారికి మనవిచేసేది ఏమిటంటే ఈ 1956-57 సంవత్సరంలో ఎక్కడెక్కడైతే ఈ electricity వేసి ఉన్నారో దాన్ని చుట్టుపక్కలఉండే గ్రామాదులకంతా విస్తరింపజేసి వ్యవసాయానికి ఉపయోగపడేటట్లుగా చేయవలెనని కోరుతున్నాను. మా ప్రాంతం చాలా మిట్టప్రదేశం లోతుభావులు. నీరు తోడేది చాలా కష్టం. పాతకోట, ఇలాకా దేవళంపేట; వడమాల్పేట, రాయలచెరువు ఈ పాయకట్టు రైతు లందరూకూడా ఎప్పుడు, electricity వస్తుందాయని ఆశతో ఎదురు చూస్తున్నారు. ఆవిషయం గవర్నమెంటువారి దృష్టికి తెస్తూ 1956-57లో ఎక్కడెక్కడైతే దీపాలకు ఇచ్చిఉన్నారో అక్కడ దీపాలకేకాకుండా వ్యవసాయానికికూడా ఇవ్వవలసిందనిమనవి చేస్తున్నాను. మరొకవిషయం ఏమిటంటే దీపాలువేసేచోట చిన్నగ్రామాలు, విశేషమయిన వరుంబడిలేనిపంచాయితీలుఉన్నాయి. వారికిelectricity supply చేయడంలో దీపానికి ఒకరూపాయి వంతున charge చేస్తున్నారు. 40 దీపాలు పెట్టుకుంటే ఒక గ్రామంలో రు॥ 40 లు వస్తోంది. అది కాకుండా current charges ఇవ్వవలసి వస్తుంది. సంవత్సరానికి రు॥500 లు hire charges క్రింద electricity charges క్రింద ఇవ్వవలసి వస్తుంది. ఇవన్నీ భారంగా ఉన్నవి. Bulbs మేము వేసుకుంటాము; మీరువేసిన tubes కు నెలకు ఇంటికి ఒకరూపాయి తీసికొండి అంటున్నారు. దీనిని సర్దుబాటుచేసి ఒకమారుగా ఆ ఖర్చు తీసుకుని current charge వారిదగ్గర తీసుకుని bulbs వారే వేసుకునేపద్ధతిమీద మార్పిస్తే చిన్నగ్రామాలకు చాలా అనుకూలంగా ఉంటుందని గవర్నమెంటువారికి తెలియచేస్తున్నాను. ఈ కొత్త తీర్మానం ఇవ్వడంలో ఈ సంగతి చెప్పవలెననేకాని గవర్నమెంటు electricity క్రింద చాలా మంచిపనే జరుగుతోంది; Minister గారు చెప్పిన ఉపన్యాసం ఉత్సాహంగానే ఉన్నది. గ్రామాలకు ఇంకా శీఘ్రంగా విరివిగా అందజేస్తే ఇంకా బాగుంటుందని మనవిచేస్తున్నాను.

* Srimathi B. RUKMINI DEVI :—అధ్యక్షా, విద్యుచ్ఛక్తిశాఖా మాత్యులు ప్రవేశపెట్టిన ఈ Demand ను బలపరుస్తూ కొన్నివిషయాలు వారిదృష్టికి తెస్తున్నాను. దేశాభివృద్ధికొరకై మనం పంచవర్ష ప్రణాళికలను ఏర్పాటుచేసుకుంటు న్నాము. ఇప్పుడు ప్రథమ పంచవర్షప్రణాళిక ఆఖరు అవుతూ ద్వితీయ పంచవర్ష

Srimathi B. Rukmini Devi] [27th March 1956

ప్రణాళిక ప్రారంభమవుతున్నది గ్రామ అభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ఏర్పాటుచేసినామని ఈ నవీనభారతదేశం అభ్యుదయపంథాలో గ్రామ అభివృద్ధికొరకై కృషిసల్పడానికి నీటిపారుదల స్కీములు, విద్యుచ్ఛక్తి పథకాలు చాలా అవసరమని వీటికి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రాధాన్యం ఇవ్వబడిందని ప్రభుత్వం తెలుపుతోంది. ఇది ఎంతైనా హర్షించవలసిన విషయం మనరాష్ట్రం పారిశ్రామికంగా వెనుకబడి ఉన్నది. నిరుద్యోగము, దారిద్ర్యము పాతుకొనిపోయి ఉన్నవి. పాతుకొనిపోయిన వాటిని తొలగించవలెనంటే నీటి పారుదల స్కీములను, విద్యుచ్ఛక్తి స్కీములను సాధ్యమైనంతత్వరలో అమలు జరపుట చాలా ముఖ్యం. గ్రామాభివృద్ధికి, జాతీయాదాయాభివృద్ధికి దోహదకారణములయిన ఈ పద్ధతులకే మనప్రభుత్వం తక్కువ మొత్తాన్ని కేటాయించడం చాలా దురదృష్టం. Revenue ఖాతా నుంచి విద్యుచ్ఛక్తి పద్దుక్రింద రూ. 1,08,94,000 లు కేటాయించడం జరిగింది, Capital outlay క్రింద రూ. 11,92,42,000 లు కేటాయించడమయినది. ఈ డబ్బు ఏ మాత్రం చాలదు. మన రాష్ట్రంలో ఈ నెలాఖరు లోపల 700 గ్రామాలకు విద్యుచ్ఛక్తి supply అవుతుందనియు ప్రస్తుతం వ్యక్తి సగటు వినియోగం 5 units అనియు, అది కొద్ది కాలంలో 10 units కు పెరుగుతుందనియు ప్రభుత్వం తెలుపుతున్నది. వర్తమానంలో గల నిరాశను, భవిష్యత్తులోగల పథకాలను చూసి నిరాశను చంపుకుని ఆశను పెంపొందించుకుంటున్నాము. కాని ఆ ఆశలు అడియాసలు అవుతున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముగిసేలోపల 16 వేల గ్రామాలలో 1600 గ్రామాలకు విద్యుచ్ఛక్తి supply అవుతుందని తెలుపుతున్నారు. ఈ విధంగా కృషి జరిగినట్లయితే రాష్ట్రంలో గల 16 వేల గ్రామాలకుకూడా విద్యుచ్ఛక్తి supply చేయడానికి 10 పంచవర్ష ప్రణాళికలు ఏర్పాటు చేసుకోవలసి యున్నది అందువల్ల ప్రభుత్వం ఎక్కువగా శ్రద్ధ వహించి ఈ పద్దులకు ఎక్కువ మొత్తాన్ని కేటాయించి త్వరలో విద్యుచ్ఛక్తిని విస్తృతం చేయడం చాలా అవసరమని మంత్రిగారిని కోరుతున్నాను. రాయలసీమలో నీటి పారుదల సౌకర్యాలు చాలా తక్కువ. ఉన్న కొద్ది నీటిని సక్రమంగా వినియోగపరుచుకుని పంటలు పండించు కోవడానికి విద్యుచ్ఛక్తి చాలా అవసరం. నీటి పారుదల సౌకర్యాలు తక్కువగా ఉన్న ఇటువంటి ప్రాంతాలకు ప్రథమ అవకాశంగా విద్యుచ్ఛక్తి supply ఇచ్చుట చాలా అవసరం. అనంతపురం జిల్లాలో కల్యాణదుర్గం, మడకశిర తాలూకాల్లో నీటి పారుదల సౌకర్యాలు ఏ మాత్రం లేవు. మడకశిర తాలూకాకు మైసూరు స్టేటులోని తెలుగు మాట్లాడే ప్రాంతం సరిహద్దుగా ఉన్నది. మడకశిర తాలూకా

లోని చెరువులకు నీరు రావాలంటే మైసూరు సరిహద్దులలో నుంచి రావాలి. గత 30 సంవత్సరముల నుంచి మైసూరు ప్రభుత్వంవారు ఈ నీటి పారుదలను అరికట్టుటచే పంటలు పండక క్షామ పీడిత ప్రాంతమయినది రైతులు పంటలు పండించుకొనడానికి బావులు త్రవ్వించుకున్నారు. ఈ బావులలోని నీరు కపిల తోలుట ద్వారా పంటలు పండించుకొనడానికి ఉపయోగించుకోవాలి. ఈ పద్ధతి చాలా వ్యయ ప్రయాసలకు లోనైనది. తక్కువ ఖర్చుతో ఎక్కువ పంటలు పండించుకొనడానికి ఈ ప్రాంతానికి విద్యుచ్ఛక్తి చాలా అవసరం. గత బడ్జటు సమావేశంలో ఈ విషయం మంత్రిగారి దృష్టికి తేగా ఈ తాలూకా విద్యుచ్ఛక్తి పథకం Chief Engineer గారి రిపోర్టులో ఉంది అనియు అది రాగానే పని ప్రారంభించగలమనియు తెలిపియున్నారు. ప్రస్తుతం రెండవ బడ్జెటులో ఉన్నాము. ఆ పథకం ఏమైనదో ఇంతవరకు తెలియడం లేదు. విశాలాంధ్ర ఏర్పడేలోగా క్షామ పీడిత ప్రాంతమయిన ఈ తాలూకాకు మొదట విద్యుచ్ఛక్తి supply చేసి తాలూకాలోని క్షామాన్ని తొలగించి ప్రజలకు తిండి కొరత తీర్చగలరని మంత్రి గారిని కోరుతున్నాను. ఈ అవకాశం ఇచ్చిన అధ్యక్షులవారికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

SRI A. C. SUBBA REDDI :—అధ్యక్షా, ఆంధ్ర రాష్ట్రం అవతరించిన తరువాత electricity మన ఆంధ్ర రాష్ట్రంలో చాలా అభివృద్ధి పొందింది అని చెప్పడానికి ఎలాంటి సందేహంలేదు. కాని ఆ అభివృద్ధి మనం ఖర్చుపెట్టిన డబ్బుకు ఉన్నదా లేదా అనేది ఆలోచించాలే కాని అభివృద్ధి కాలేదని ఎవరూ చెప్పరు. ఒక చిన్న ఉదాహరణం చెబుతాను. ఒక స్తంభం నాటడానికి మదన పల్లిలో రు. 70 లు contract ఇస్తున్నారు. నేడు సాధారణ స్తంభం నాటడానికి రు. 10, 15 లు అవుతుందని నా అంచనా. దానికి contractor కు రు. 70 లకు ఇస్తున్నారు. దీనినిబట్టి చూస్తే, మనం ఖర్చుపెట్టిన దానిలో 1/3 వంతు పని జరుగున్నదేమో అనే చింత తప్ప మరొకటిలేదు. ఖర్చుపెట్టుచున్నాము; అభివృద్ధి తెచ్చుకుంటున్నాం అనే సంతోషం ఉన్నది. అయితే ఖర్చుపెట్టి నంతగా అభివృద్ధిలేదని చింతగా ఉన్నది. Contract system P.W.D. లోను ఉన్నది; ప్రతివారికి tender form ఇస్తారు. ఇచ్చిన తరువాత lowest tenders కు contract ఇచ్చుకునే అలవాటు ఉన్నది. ఇవ్వకపోతే reasons చెప్పి వేరే tenderer కి ఇచ్చే అలవాటున్నది. ఇక్కడ మాత్రం మనం అనుకున్న 4, 5 గురికే tender forms ఇచ్చి అందులో ఎవరు తక్కువ ఇస్తే వారికి contract ఇస్తారు.

Sri A. C. Subba Reddi] [27th March 1956

ఎవరికి tender ఇవ్వదలచుకుంటే వారికి 5 forms ఇస్తే, ఆ 5 forms ను fill up చేసి tenders ఇస్తే వానిది lowest tender అవుతుందనే ఉద్దేశంతో P. W. D. వారు ఇస్తున్నారని నాకు తెలుస్తూ ఉన్నది. P. W. D. Public Waste Department అనుకుంటున్నారు. ఈ department పకడ్బందీగా చేయకపోతే చాలానష్టం వస్తుందని నా అభిప్రాయం. మరొక విషయం చెబుతున్నాను. ముఖ్యమంత్రిగారికి కొన్ని సంఘటనలను గురించి వివరాలు ఇచ్చాను. విచారణ చేస్తామని చెప్పారు. విచారణచేస్తుంటారు అనుకుంటాను. మంత్రిగారి దృష్టికి తెస్తే బాగా విచారిస్తారని చెబుతున్నాను. లేకపోతే ఈ డిమాండును గురించి మాట్లాడ నవసరమేలేదు. Improvement అవుతోంది కాబట్టి తప్పులు మంత్రిగారి దృష్టికి తెస్తే సరిదిద్దుకుంటే ఇంకా అభివృద్ధి చేసుకోవచ్చును దుర్వినియోగం ఎక్కడ అవుతుందో మంత్రిగారి దృష్టికి తీసుకురావాలని నా ఉద్దేశం.

విశాఖపట్నం జిల్లా పెందుర్తినుంచి గొల్లపల్లివరకు 1½ మైలు రు. 15000 ల ఖర్చుతో 11 K.V. లైను వేసినారు దీనికి ఉత్తరువులు అయినవా ? వేసిన తరువాత ఈ దినంవరకూ ఆ 11 K. V. line అక్కడ ఉన్నదా ? మళ్ళీ తీసివేసినారని తెలుస్తున్నది. అక్కడలేదు మంత్రిగారు పరిశీలించవలెనని అంటున్నాను. దీనికి ఎవరు శాంక్షను ఇచ్చినారు, ఎందుకు తీసివేసినారు మంత్రిగారు కనుక్కొన వలసినదని ప్రార్థించుచున్నాను.

రు. 14000 లు copper wire ను జాస్తీగా draw చేసి చోడవరం మిల్లులో దానిని దాచిపెట్టి, దాని విషయమై కేసుపెట్టి మళ్ళీ ఆ కేసు ద్వారా return చేసినారు. ఎవరు ఈ 14000 copper wire ను జాస్తీగా draw చేసినారు. ఎవరు దాచిపెట్టినది ; విచారించి ఎవరికైనా పనిష్మెంటు ఇచ్చినారా అని మంత్రిగారు విచారించ కోరుచున్నాను.

5 Tons copper wire ను Simhachalam Central Stores నుండి (ఖరీదు ఇంచుమించు 25,000 రూపాయలు) Junior Engineer గారు సంగ్రహించి బహుశః మళ్ళీ తిరిగి కలకత్తాకు export చేసినారు. రు. 25,000/- ల విలువగల copper wire కలకత్తానుంచి వచ్చినది—తిరిగి కలకత్తాకు పోయింది. ఇవన్నీ జరుగుతూ ఉంటే సాధారణముగా వీటిని అన్నింటిని విచారించి ఏమి చేస్తున్నారు? వీటిని సరిగా చూస్తే తప్పకుండా ఇవి జరగకుండా పోతవి అని నాయొక్క ఆశ. ఇంతేకాకుండా ఈ department లో District Central Stores అంటూ

17th March 1956] [Sri A. C. Subba Reddi

ఉండేవి. ఈ department లో Accounts Officer అని ఒకరు ఉన్నారు. వారి పేరు, హోదా నాకు తెలియదు. ఇటువంటి అధికారి P. W. D.లో కాని ఇంకెక్కడా లేరు. ఇక్కడమాత్రం ఉంటున్నారు, అది superfluous appointment అని నా స్వంత అభిప్రాయము. ఆయన క్రింద ఈ district stores ఉండేవి. ఇప్పుడు ఉన్న information ఏమిటంటే దాదాపు రు. 40 లక్షల పోర్సు పోయినతరువాత దానిని తప్పించుకోడానికి central stores అని పెట్టి ఈ accounts ను గైర్ హాజర్ చేసినారని నాకు తోస్తుంది 40 లక్షల రూపాయల stores, district stores నుండి central stores కూడా అనినాకు information ఉన్నది.

ఇది సరిగా విచారించకపోతే బహుశః మనము విద్యుచ్ఛక్తికి ఖర్చుపెట్టే సొమ్ములో సగం ఇట్లాపోతుందేమో అని చింతపడుతూ మంత్రిగారికి చెబుతున్నాను. ఇవన్నీ సరైతే ఈవేళ Demand లో చూపిన మొత్తానికి రెండింతలు పనిచెయ్య వచ్చును, అని నా అభిప్రాయము కాబట్టి మంత్రిగారు ఆలోచించి, వీటిలో concerned officers ను బాగా punishment ఇప్పించినట్లయితే తక్కినవారికి భయముగా ఉంటుంది. పని సరిగా చేస్తారని ఆశిస్తూ నేను ఇంతటితో విరమించు చున్నాను.

* Sri K. SANTHAPPA :—అధ్యక్షా, ప్రభుత్వంవారు ప్రవేశపెట్టిన విద్యుచ్ఛక్తి demand ను బలపరుస్తూ కొన్ని విషయాలు ప్రభుత్వం వారికి మనవి చేసుకుంటున్నాను. అనంతపురం జిల్లా కళ్యాణదుర్గం, మడకశిర తాలూకాలు చాలా వెనుకబడినవని శ్రీమతి రుక్మిణమ్మగారు చెప్పినారు. మాకు జీవనదులులేవు మామిడాకులతో జీవనం చేసుకునే రైతులు మాకళ్యాణదుర్గం తాలూకాలో ఉన్నారు. కంచకట్టినట్లు మాచుట్టూఉన్న గుత్తి, ధర్మవరం, ఉరవకొండ, రాయదుర్గం మైసూరుస్టేటు పావగడా నాలుగు ప్రక్కలా మిళుకు మిళుకుగా వెలుతురు ఉన్నది. ఏమి ఖర్మముచేసినామో మాకులేదు. మబ్బులో ఉన్నాము. ఈ అవస్థలతో మేముఉన్నాము. గౌరవనీయులైన ఉపముఖ్య మంత్రిగారు 1954 లో ఒక బహిరంగసభలో మాట్లాడుతూ తెలుగు సంవత్సరాదికి కళ్యాణ దుర్గంలో దీపం వెలిగిస్తాము అని వాగ్దానము చేశారు. నేటివరకు రాలేదు. మా ఖర్మము ఏమో, ప్రభుత్వంవారు లక్షల కోట్లు ఖర్చుపెడుతున్నారు. మాకోటి బీదలకు అనుకూలంగాలేదు. 8, 9 మెట్లలోతు బావులు యున్నవి. ఆ బావులు మాతాలూకాలో రాళ్లురప్పలతో కూడికొని యున్నవి. ఆకాశం మూసి వర్షము వచ్చినతరువాత భూమిని దున్నకోవాలి. ఇప్పుడైనా ఈ ప్రభుత్వం

Sri K. Santhappa] [27th March 1956

వారు, ఈ డిపార్టుమెంటు మంత్రిగారు దయతలచి కళ్యాణదుర్గం, మడకశిర తాలూకాలకు త్వరలో electricity ఏర్పాటు చెయ్యవలెనని ప్రార్థిస్తూ నేను విరమించుచున్నాను.

Sri CHIDAMBARA REDDI :—అధ్యక్షా, విద్యుచ్ఛక్తి మంత్రిగారు ప్రవేశపెట్టిన పద్దును నేను బలపరుస్తున్నాను. ఈ నాడు విద్యుచ్ఛక్తి కావలెనను అనేకోటిక దేశములో ప్రబలిపోతున్నది. ప్రతి సభ్యుడుకూడా తన నియోజక వర్గములో ఎంతత్వరగా వీలైతే అంత త్వరగా విద్యుచ్ఛక్తి సరఫరా చేయించు కొనవలెనని ప్రయత్నము చేస్తున్నారు. అనంతపురం జిల్లానుండి వచ్చిన ప్రతి సభ్యుడు ఏమి మాట్లాడినా ఉన్న కష్టములను మంత్రిగారికి తెలుపుకొనడమే జరుగుచున్నది. రుక్మిణమ్మ, శాంతప్ప ఈ జిల్లాలోనివారు పడుతున్న కష్టపాటుగురించి మాట్లాడినారు మా జిల్లాలో దక్షిణ తాలూకాలు కేవలం భావుల సేద్యం తోనే బ్రతుకుతున్నాము. అది మా దురదృష్టం. ఒకప్పుడు ఉమ్మిడి మద్రాసు ప్రభుత్వ 1892 లో మైసూరులో చేసికొన్న దురదృష్టపు agreement వల్ల మాకు వస్తూన్న నీరు వారు ఆపుదల చెయ్యడమువల్ల నీరు రాక భావులు త్రవ్వుకోవలసి వచ్చింది. 50,000 భావులు ఉన్నవి. రాష్ట్రం మొత్తం మీద చిత్తూరులో 60,000 అనంతపురంలో 50,000 దక్షిణతాలూకాలలో 30,000 భావులు ఉన్నవి. ప్రతిబావి 20 నుంచి 60 అడుగులలోతు ఉంటున్నది. 4, 5 సంవత్సరాలకు ఒకసారి కరువురావడము మాకున్న గొడ్డుగేదను మేము అమ్ముకోవడం వలస పోవడము, వర్షం వస్తే వెనుకకు రావడము ప్రభుత్వం నుండి అప్పులు తీసుకోవడం ఎద్దులనుకొని సేద్యంచెయ్యడం జరుగుచున్నది. ప్రజల బాకీలు తీర్చడానికి అది సరిపోతుంది. రైతు ఏమాత్రము సుఖపడడములేదు. ఈనాడు మా అయిదు తాలూకాలు అభివృద్ధి పొందవలెనంటే ప్రభుత్వంవారు తగుశ్రద్ధవహించి, అక్కడి పరిస్థితులను గమనించి విద్యుచ్ఛక్తి సరఫరాచేస్తేనే తప్ప ఏమీ ప్రయోజనం ఉండదు. మంత్రిగారు సెలవిస్తూ మెట్టప్రాంతాలకు ప్రాధాన్యము ఇస్తున్నామన్నారు. లోకంలో ఉన్న అపోహకూడా వారేచెప్పేరు. గడచిన 14 మాసాలు జరిగిన ప్రభుత్వములో త్వరత్వరగా సరఫరా జరుగుతుందనే ఆశ ఉంది గాని అది కొంత పడలింది. జరగలేదని నేను చెప్పలేదు. మొత్తం మీద 111 స్కీములు అమలు జరుగుతున్నాయన్నారు. అందులో ఎన్ని స్కీములు మాజిల్లాకు అంటే అసలు లేవనిచెప్పాలి. పోతే 2, 3 జరుగుచున్నవి అని చెప్పాలి. కనుక మాజిల్లాపైన కొంత శ్రద్ధ తీసుకోవలెను. భావులవల్ల సేద్యముచేసి బ్రతికిన వారు లేరు అనే సామెతఒకటి ఉంది. మంత్రిగారు ఆ సామెతను పోగొట్టేటట్లు చేస్తారని ఆశిస్తు ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులవారికి నా వందనములు.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, విద్యుచ్ఛక్తి శాఖ మంత్రిగారు ప్రవేశపెట్టిన యీ Demand లను రెండింటినీకూడా నేను బలపరుస్తున్నాను. యిదివరకు మా అనంతపురం జిల్లా సభ్యులు చాలమంది మాట్లాడుతూనే వచ్చినారు. నేను అనంతపురం జిల్లాకు చెందినవాడినే కొబట్టి ఏవిధంగా lift irrigation పై ఆధారపడుతున్నది చెబుతాను. వర్షములులేకుండా ఎమివున్నప్పటికీ బావులు సేద్యంలోవున్న కష్టాలగురించి నేను ఎక్కువగా చెప్పవలసిన పనిలేదు. ఇదివరలో యీ ప్రాంతాలలో ఎక్కువగా విద్యుచ్ఛక్తి సరఫరా జరుగనందుకు కారణాలు వివరిస్తూ కొన్ని అపోహాలున్నాయి అని వారు చెప్పినారు. దానినిగురించి ప్రభుత్వ విధానంలో కొంత మార్పురావలసి ఉందని మాత్రం తమద్వారా మంత్రిగారికి మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ఏమిటంటే యీ percentage of annual returns అనేది యిదివరకు ఉండేటటువంటి ప్రకారం మంత్రివర్గంలో ఏవిధానం అనుసరించామో ఏమోగాని యిప్పటికిమాత్రం 11 percent ఉంటేనేగాని schemes తీసుకురాము అనేటటువంటి ఒక నిర్ణయం యీ ప్రభుత్వం చేసుకొని ఉండేది, అయితే దరిమిలా శాసనసభ్యులు చాలమంది యీ 11 percent చాలా జాస్తిగా ఉన్నది. Capital outlay ఏమయినా scheme తయారుచేయాలంటే 8 percent మాత్రమే పెట్టుకోవలసినది, ఎందుకంటే యివన్నీ వెనుకబడిన ప్రాంతాలని ముఖ్యమంత్రిగారికి, మంత్రిగారికి రాయబారంవెళ్ళి విషయాలు విన్నవించుకున్నాం. తరువాత ముఖ్యమంత్రిగారు యీ విషయంలో విధానం S.F.C meeting లో యీ subject ను పెట్టి 11 percent నుంచి 10 percent తగ్గించారు. అంతవరకు ప్రభుత్వానికి కృతజ్ఞులుగా ఉంటున్నాం. అయితే యీ 10 percent అన్నప్పటికీ యివి చాలా thinly populated areas కాబట్టి గ్రామం అంటే 40 యిండ్లు 50 యిండ్లు ఉంటాయి. ఒక గ్రామానికి 8,10 బావులుంటాయి. ఏ 1,2 మిద్దెయిండ్లుతప్ప మిగిలినవి పూరిగుడిశలే. కొబట్టి percentage of annual returns జాస్తి కావాలంటే ఏ domestic services, industrial connections ఉంటేనేగాని percentage of annual returns పెరగడానికి అవకాశంలేదు. మా గ్రామాలలో చూస్తే కేవలం పూరిగుడిశలున్నాయి కాని మిద్దెయిండ్లు లేవు. కొబట్టి కనీసం యీ domestic connections canvass చేయడానికి వీలులేకుండావున్నది. కనుక అన్నివిషయాలలో మా రాయలసీమ ప్రాంతాలకు కొన్ని concessions యిస్తూవచ్చినారు. ఉదాహరణంగా Rural Banks విషయంలో అన్నిచోట్ల 50,000 Minimum Share capital ను fix చేస్తే రాయలసీమకు 25,000 fix చేసినారు. అదేప్రకారంగా మెట్టప్రాంతాలు

Sri N. C. Seshadri] [27th March 1956

కరువుప్రాంతాలు అయినటువంటి యీ అనంతపురంజిల్లా, రాయలసీమవలె వెనుకబడిన శ్రీకాకుళం, విశాఖపట్నంజిల్లాలు చాలా వెనుకబడిన ప్రాంతాలు కొబట్టి percentage of annual returns 8 percent దాకా ఉండే విధానం అనుసరించాలని నేను ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. తరువాత ఈ capital outlay 11,93,00,000 చిల్లర యీ capital outlay constuction కు గాను పోగా rural electrification కు 5,59,00,000 మాత్రం కేటాయించారు. ఈ 5,59,00,000 లలో Caltex Company, Vizag కు 23,31 000, నందికొండ construction works కు 50,75,000, యీ విధంగా ఎక్కువడబ్బు పోతున్నది. అయినప్పటికీకూడా నేను వారికి మనవిచేసుకునేది ఏమిటంటే సుమారు 75 లక్షలే కాకుండా చిన్న Ferro manganese mines వీటన్నిటికికూడా connections యిచ్చినట్లయితే దాదాపు యీ గ్రామీణ విద్యుచ్ఛక్తికి కేటాయించిన డబ్బులో దాదాపు కోటిరూపాయలు దానికేపోతుంది. దానికి connections యివ్వకూడదనే మాట కాదు. ఎందుకంటే ప్రభుత్వానికి లాభదాయకం అయినటువంటి పనులు చేయవలసినదే. లాభదాయకమైనటువంటి schemes ను అమలు జరపుటకు కేంద్ర ప్రభుత్వాన్ని అభ్యర్థించి మనం వారిదగ్గరనుంచి యీ industrial connections గాను ప్రత్యేకంగా డబ్బుతెచ్చుకోడం మనవిధి, అని నేను భావిస్తున్నాను. అంతే కాకుండా గ్రామీణ విద్యుచ్ఛక్తికి సంబంధించినది. Budget నుండి తీసివేయడం న్యాయంకాదని నేను ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. ప్రభుత్వవిధానం వివరిస్తూ మెట్టప్రాంతాలకు priority యిస్తాంఅని చెప్పినారు. ముఖ్యంగా మా రాయదుర్గం తాలూకా గురించి యిదివరలో శాసనసభ్యులు చాలతూర్లు చెప్పినారు. మా జిల్లాలో 7,000 బావులున్నాయి. సుమారు 15,000 Oil engines యీ రోజున పనిచేస్తున్నాయి. నేను 2 Oil engines పెట్టుకుని నీరు తోడుతున్నాను. నెలకు Average 300 ఖర్చవుతుంది. 300 ఖర్చుచేస్తే తీరా పంటవచ్చేసరికి Diesel oil ఖర్చుకు engine wear and tear ఖర్చుకు సరిపోతుందిగాని కేవలం యీ వ్యవసాయంలో ఏ మాత్రం లాభంలేకుండావున్నది. ఈ విషయాలు దృష్టిలో ఉంచుకుని మంత్రిగారు రాయదుర్గం తాలూకాలో గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా గురించి ఎక్కువ శ్రద్ధతీసుకోవాలని మనవిచేస్తూ యీ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షులవారికి నమస్కృతులర్పిస్తున్నాను.

**SRI S. NARAYANAPPA** :—అధ్యక్షా, మన విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి శ్రీ అన్నపూర్ణగారు ప్రవేశపెట్టిన Demand ను బలపరుస్తూ వారిదృష్టికి

ఉన్నటువంటి కొన్ని యిబ్బందులను తీసుకుని రావడలచాను. ఇంతవరకు మా జిల్లా నుంచి (అనంతపురంజిల్లా) నుంచి 4 గురు సభ్యులు మాట్లాడినారు. ఉన్నకష్టాలను వారు చెప్పారు బావిడి ఆసరాలకు విద్యుశ్ఛక్తి అవసరం, విద్యుశ్ఛక్తి సరఫరా కావాలని మనవిచేసినారు మెట్టప్రాంతాలలో వ్యవసాయం, పరిశ్రమలు అభివృద్ధి చెందడానికి విద్యుశ్ఛక్తి సరఫరా చేయాలని కోరినారు. ఇదేకాకుండా గడచిన మంత్రివర్గంలో శ్రీయుత లచ్చన్నగారుకూడా ఉన్నారు. విద్యుశ్ఛక్తి సరఫరా విరివిగాసాగెను. గడచిన ఎన్నికలలో ఒక్కొక్క electric స్తంభం ఒక్కొక్క బూత్ కు election agent-గా పనిచేసినదని నా విశ్వాసం. గడచిన 3 మాసాల ప్రభుత్వం విద్యుశ్ఛక్తి సరఫరా పాదరసం మాదిరిగా రాష్ట్రమొత్తం మీద ప్రసరింపజేసినారు. చాల చురుకుగా పనులు జరిపించిరి. Electricity department లో ఉన్నటువంటి ఉద్యోగులు అత్యంత శ్రద్ధతో పనిచేసినారు అదేమాదిరిగా యీ శాఖను నిర్వహిస్తున్న శ్రీ లచ్చన్నగారు, అత్యంతశ్రద్ధతో యీ పనులు, రాయలసీమ, శ్రీకాకుళం విశాఖపట్నం జిల్లాలు వెనుకబడిన ప్రాంతాలను దృష్టిలో ఉంచుకుని అక్కడున్న పరిశ్రమలనండి వ్యవసాయమనండి; వీటికి ముఖ్యంగా విద్యుశ్ఛక్తి సరఫరాచేస్తేతప్ప అభివృద్ధి చెందడానికి అవకాశంలేదు. ముఖ్యంగా నీటి పారుదల విశేషంగాఉన్న ప్రాంతాలకంటె విద్యుశ్ఛక్తి సరఫరా మెట్టప్రాంతాలలో బావిడి ఆసరాతో 4 ఎకరాలభూమినిసాగుచేసి 4 పుట్ల ధాన్యాన్ని పండించు రైతులకు సహాయం చేయడానికి ప్రయత్నం చేయాలి. ముఖ్యంగా గుత్తి తాలూకాలో గుత్తి, ఉరవకొండ ప్రాంతాలకు electricity సప్లయి చేసినారు. అయితే పల్లె ప్రాంతాలలో ఉన్నబావిడి ఆసరాలతో వ్యవసాయానికి విద్యుశ్ఛక్తి అవసరం. మా గుత్తి తాలూకాలో నాగసముద్రం ఫిర్కా ఉన్నది. ఆ firka అన్నివిధములచాలా వెనుకపడిన ప్రాంతము. గుట్టలు, కొండలు కలిగిన ప్రదేశం. రవాణా సౌకర్యములు బొత్తిగాలేవు. వజ్రకరూరు గ్రామానికి Electricity యిచ్చినారు. వజ్రకరూరు నుండి ఎద్దులపల్లి మీదుగా పామిడికి connect చేస్తే ఆ మధ్యప్రాంతములోవున్న పల్లెప్రజలకు బావిడి ఆసరాతోచేస్తే వ్యవసాయం అభివృద్ధి చెందుతుంది. గుంతకల్లునుంచి నాగసముద్రంమీదుగా పామిడికి connect చేసే schemeను దర్యాప్తు చేస్తున్నాం అని తెలిపినారు. దీనివల్లకూడా బావిడి ఆసరాతోసేద్యం చేసేవారికి ఎక్కువ ఉపయోగం ఉంటుంది. ఇది కాకుండా గుంటకల్లునుంచి దాదాపు 10, 12 మైళ్లు దూరంగా వున్నటువంటి కొన్ని పంచాయతీగ్రామాలు ఉన్నాయి. ఈ పంచాయతీల మీదుగా electricity తీసుకునిపోతే ఆ పంచాయతీగ్రామాలలో యీ electricity ని ఉప

Sri S. Narayanappa] [72th March 1956

యోగించుకోవడమే కాకుండా అక్కడున్న వ్యవసాయం అభివృద్ధి చెందడానికి అవకాశం వున్నది. ఎట్లంటారా అంచనహాళ్లు, గడేకల్లు, దోనేకల్లు, రామాపురం, విడుపనకల్లు, పాల్తూరు వగైరా పెద్దగ్రామాలున్నాయి. ఆ గ్రామాలలో పంచాయితీలున్నాయి. ఆ పంచాయతీలలో electricity ఉపయోగించుకోవడమే కాకుండా, రైతాంగానికి ఉపయోగపడుతుంది.

ఉరవకొండకు 6 మైళ్లదూరములో పాల్తూరు గ్రామము ఉన్నది. అక్కడ నుంచి ప్రతిరోజూ 60 మణుగులు మల్లెపూవులు పెద్దపెద్ద పట్టణములకు ఎగుమతి అవుతూ ఉంటాయి. 100 బావులక్రింద ఈ మల్లెపూవుల తోటలు, వ్యవసాయపు పంటలు మొదలగునవి పండిస్తున్నారు. అందువల్ల ఆ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయించమని అడుగుతున్నాము. ప్రభుత్వానికి తెలియజేశాము. అది పరిశోధనలో ఉన్నదని చెప్పారు. ఇంతవరకు అది ఏమి అయిందో తెలియడము లేదు. మడకసిర, కళ్యాణదుర్గం, గుత్తి, తాడిపత్రి, రాయదుర్గం తాలూకాలలో ఎక్కువబావులక్రింద వ్యవసాయము జరుగుతున్నది. అక్కడకు ముఖ్యంగా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయించవలసిన అవసరము ఉన్నది. అక్కడ గ్రామాలలోకి పోయిచూస్తే, ప్రజలకు త్రాగేందుకుకూడా సరియైన నీరు లేకుండాయున్నది. ఆ ప్రాంతప్రజలు నారికురుపులతో బాధపడున్నారు. విద్యుచ్ఛక్తిని అక్కడకు సరఫరాచేసినట్లయితే, దూరప్రదేశముల నుంచి అయినా తక్కువఖర్చుతో నీరు తీసుకొనిపోయి, అక్కడప్రజలకు త్రాగేదానికైన నీటిసౌకర్యము కలుగజేయడానికి వీలుంటుంది. అక్కడ ఉన్న పెద్దపెద్దగ్రామాలలోకూడా ఎన్నో ఏండ్లనుంచి, స్నానముచేసే, బట్టలు ఉతికిననీటినే పశువులకు త్రాగుటకు ఉంచుతున్నారు. అక్కడ ప్రజల జీవనముచూస్తే చాలా కష్టంగా ఉన్నది. ఆ విషయము అన్నియూ మంత్రి శ్రీ లచ్చన్నగారికికూడా తెలుసు. గుత్తి, తాడిపత్రి, గుంతకల్లు, ఉరవకొండ ప్రాంతములలో ఉన్న అన్ని స్కీములకు ప్రాధాన్యము ఇవ్వవలసి ఉంటుంది. మా జిల్లాలో ఉన్న స్కీములు రిటర్న్ 10% నిర్ణయించిన చాలా కష్టంగా ఉంటున్నది. కాబట్టి తక్కువ రిటర్నువచ్చిన కనీసం 5% కు అయినా తగ్గించి విద్యుచ్ఛక్తి సరఫరాచేయాలనే ఉద్దేశ్యముతో వారు పట్టుపట్టి చూడాలని కోరుతున్నాను. ఆవిధంగాచేస్తే అక్కడ, ఉన్నటువంటి ప్రజలందరూ బాగుపడేదానికి అవకాశము ఉంటుంది. అక్కడ ఉన్న పల్లెప్రజలకు మంచినీటి సంఫరాసౌకర్యములు కలుగచేస్తే ఎంతో ఆనందిస్తారు. కొన్నికొన్ని పద్దులకు అనవసరంగా డబ్బు ఖర్చుపెడుతున్నారు. గుంతకల్లులో ఎన్నోవేల రూపాయలు విలువగలిగి

27th March 1956] [Sri S. Narayanappa

నటువంటి, విద్యుచ్ఛక్తిసామానులతో పెద్ద workshop ఉన్నది. అక్కడ store కూడా వుంచినారు. సామానులు త్రోలిన బాడుగలు హెచ్చురేట్లకు ఇదివరలో ఇచ్చారు. ఈ విధమైన హెచ్చురేట్లను తగ్గింపుచేసి estimates, prepare చేసే టప్పుడు ఆ ప్రాంతములో ఉన్నటువంటి లోకల్ రేట్లకు అనుగుణ్యంగా చేయవలయును. కొంచెము బందోబస్తుగా ఈవ్యవహారము అంతా జరిపితే ప్రభుత్వానికి కూడా లాభించే అవకాశము ఉంటుంది. కాబట్టి మంత్రిగారు ఆ విధానములో అత్యంత శ్రద్ధతో, ఆసక్తితో ఆలోచిస్తారని నాకు నమ్మకంఉన్నది ఆంధ్ర రాష్ట్రీము మొత్తముపైన ఎన్నోకోట్లరూపాయిలు విద్యుచ్ఛక్తి విలువగలస్కీములు అమలు జరుగుతున్నాయి. అయినా విద్యుచ్ఛక్తి దీపాలు వగైరా సామానులను తయారుచేయు ఫ్యాక్టరీ ఒక్కటీకూడా మన రాష్ట్రీంలో స్థాపించుకోవడానికి యింతవరకు ప్రయత్నం జరుగలేదు. అందువల్ల కేంద్రప్రభుత్వం ప్లానింగుకమీషన్ ఆమోదంపైన మన రాష్ట్రీములో తక్కువపెట్టుబడితో విద్యుచ్ఛక్తి దీపాలు వగైరా తయారుచేసుకునే ఫ్యాక్టరీని స్థాపించుకున్నట్లయితే, ప్రభుత్వానికి మిక్కిలి లాభకరము. రాష్ట్రీము ఆర్థిక అభివృద్ధి జరగడానికి వీలుంటుంది, కాబట్టి ప్రయత్నం చేస్తారని నేను ఆశిస్తున్నాను. తుంగభద్ర హైడ్రో ఎలక్ట్రిక్ స్కీము ఈ డిసెంబరు ఆఖరుకు పూర్తి అవుతుంది అంటున్నారు. అందువల్ల ఈ డిసెంబరులోపువే రాయలసీమలో వెనుకబడిన ప్రాంతాలన్నింటిలో స్తంభాలు నాటి, తీగెలు వేయించి విద్యుచ్ఛక్తి ప్రసారం వచ్చేప్పటికే సిద్ధంగా యుంచినట్లయితే వెంటనే విద్యుచ్ఛక్తిని ప్రజలకు సరఫరా చేయడానికి వీలుంటుంది. అందువల్ల ప్రభుత్వం వారు ఈ విషయములన్నీ దృష్టిలో పెట్టుకొని, వెంటనే దానికి కావలసిన estimates అన్నీవేసి, తక్కువ రేట్లకు పల్లెలలో రైతులకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయిస్తే వుపయోగంగా ఉంటుంది. 'అందువల్ల పై పద్ధతిని వెంటనే అమలు జరుపుతారని ఆశిస్తున్నాను. రాయలసీమ ప్రజలలో ఉన్న కష్టాలను నివారించడమునకు మంత్రిగారు అత్యంత శ్రద్ధాసక్తులతో పని చేస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri P. GOPALU REDDI :—అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ విద్యుచ్ఛక్తి డిమాండును తప్పకుండా బలపరచక తప్పదు. ఆంధ్ర ప్రభుత్వము ఏర్పడిన తరువాత మన రాష్ట్రీంలో ముఖ్యంగా మా చిత్తూరు జిల్లాలో విద్యుచ్ఛక్తి విస్తరణ బాగా జరిగిందని ప్రభుత్వాన్ని, విద్యుచ్ఛక్తి మంత్రిగారిని నేను అభినందిస్తున్నాను. ఈ విస్తరణ ఒక స్థాయిలో జరిగిందని చెప్పుకోవాలి. వెనుక, రాబోయే సౌకర్యముల కోసము గ్రామాదులలో విద్యుచ్ఛక్తి సరఫరా కోసం చిన్న చిన్న

Sri P. Gopalu Reddi] [27th March 1956

లైనులు వేయు ఉద్దేశ్యముతో, main lines కు చాలా డబ్బు ఖర్చు పెట్టినారు. ఈ ఖర్చు అంతా విద్యుచ్ఛక్తి తయారయ్యే సమయంలో అన్ని గ్రామములకు అనువుగా, అన్ని గ్రామాలకు ఒకే పర్యాయం సప్లయి చేయాలని ఉద్దేశ్యంతో చేసినందుకు వారిని మరింత అభినందిస్తున్నాను. అయితే 1952 వ సంవత్సరములో ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో శాంక్షను అయిన స్కీము ఒకటి వెనుకబడిందని చెప్పడానికి విచారిస్తున్నాను. పూనిమాంగాడు, నెమ్మలి, మొదలగు 4, 5 గ్రామములకు సంబంధించిన పెద్ద స్కీము, విశేషంగా రెవిన్యూ రాగలిగిన స్కీము, main lineకు సుమారు 4 మైళ్లు లోపలయున్నది. ప్రస్తుతం విస్తరణ జరిగిన చోటు శత్రుంజయపురం నుంచి 2½ మైళ్లు, 3 మైళ్లు ఉన్నదని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఈ విషయమును పదేపదే, పోయిన బడ్జటు డిమాండుపై ఉపన్యాస సమయములోను, ఇతరత్ర అనేక సమయములలోను, స్వయంగా రైతులద్వారా మంత్రిగారికి విన్నవించుకున్నాము. అది ఈ నాటికికూడా sanction కు ఈ ప్రభుత్వమువద్దకు రాలేదని మనవిచేయుటకు చాలా విచారంగా యున్నది. ఈ సంవత్సరము అయినా తప్పనిసరిగా ఆ స్కీమును అమలు జరపవలయునని మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను. ఈ స్కీములలో ఒక చిన్న ఇబ్బందిని గమనించవలసి ఉన్నది. అనేక కోట్ల కొలది, లక్షల కొలది డబ్బు ఖర్చుపెట్టి, చేస్తున్నటువంటి ఈ విస్తరణ స్కీములమీద ప్రభుత్వానికి కొంతైనా దృష్టి లేవందుకు విచారిస్తున్నాను. 10 లక్షలు ఖర్చుపెట్టి తక్కిన ఆదాయము వచ్చే స్కీములు వేస్తున్నారు. అది శాంక్షను అవుతున్నది అది ఏమీ మాకు అర్థము కావడములేదు. Remunerative అంటున్నారు. తరువాత మరల కాదంటారు. ఆ లెక్కలు ఏవిధంగా తయారవుతాయో మాకు అర్థం కావడములేదు. ఈనాడు మన ప్రతిపక్షములో యున్న సోషలిస్టు పార్టీ లీడరుఅయిన రామకృష్ణంరాజుగారుకూడా చాలా అభినందనీయంగా మాట్లాడారు. కట్టకడపటికి ఇండ్లకు దీపములకు ఉపయోగిస్తున్నారుగాని, వ్యవసాయమునకు ఏమీ ఉపయోగపడడంలేదు అన్నారు. వచ్చే సంవత్సరంకూడా చేసేదానికి వీలులేదని డిపార్టుమెంటువారు చెబుతున్నారు. కేవలం ఇండ్లలో దీపాలకు, ఫ్యాన్ లకు ఉపయోగిస్తే, ప్రభుత్వమునకు ఏమీ ఆదాయం రాదని అందరికీ తెలిసినదే. చిత్తూరు జిల్లాలో దీపాలకోసకు కార్వేటి నగరంకు 9½ మైళ్లు లైనువేసి విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తున్నారు. ఆ మార్గంలో ఉన్నటువంటి రైతులకు ఏమీ ప్రొవిజన్ కల్పించడములేదు. Remunerative కాదంటున్నారు. ఎందువల్ల కాదో అర్థం కావడంలేదు. అందువల్ల విద్యుచ్ఛక్తి సరఫరా పద్ధతిలో మార్పు జరుగవలదే తప్ప

న్యాయంగా రైతులకు ఇది శీఘ్రంగా అందుతుందని ఆశించడానికి వీలులేదని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

కేవలం వ్యక్తుల పరంగానో, లేక ఇతరత్రా మంత్రులకు అనుయాయులుగా ఉండేవారికి అనువుగా ఉండే రీతిగానో స్కీములు తయారుచేయడం, అవి sanction చేయడంవల్ల ప్రజాసమూహమునకు అన్యాయం జరుగుతున్నదని ప్రభుత్వానికి మనవిచేయవలసి ఉంటుంది. మిత్రులు A. C Subba Reddi Garu చెప్పినట్లుగా దీంట్లో అనేకమైన అన్యాయములు జరుగుతున్నవి. ఒక్క electric post నాటుటకు 76 రూపాయలు ఖర్చుపెడుతున్నది ప్రభుత్వం. ఈ విషయం ప్రజలు తెలుసుకొన గల్గినట్లయితే ఆందోళన చెందుతారు. దానిని ఏవిధంగా contract కు ఇస్తున్నారో తెలియదు. ఈ విషయం ప్రభుత్వమునకు తెలుసు. కాని ఎటువంటి పరిస్థితులలో ఆ estimates ను అంగీకరిస్తున్నారో తెలియదు. ఒక చిన్న విషయం చెప్పి విరమించుకుంటున్నాను.

తిరుపతి దగ్గర రేణిగుంటనుండి పాకాలవరకు 66 K. V. line వేసినారు. ఒక contractor కు ఇచ్చినారు. ఆ contractor agreement వ్రాసి ఇవ్వలేదు. పనిపూర్తిచేయలేదు. కావలసిన సామాగ్రి అంతా పుచ్చుకున్నాడు. అయితే పనిపూర్తి చేయకుండానే పారిపోయినాడు. ఈ సంగతి ప్రభుత్వమునకు తెలుసు. ఏమి చర్యలు తీసుకున్నారో మాకు తెలియదు. Contractors ఏదైనా ఒక స్థంభం ఎండు భూమిలో పాతవలసి వచ్చినప్పుడు 25, 50 రుపాయలు అవుతుంది. రైతు ఆ భూమిలోనే నీరు పెట్టి అదును చేసినట్లయితే 70, 90 రూపాయలుకూడా ఇచ్చుకోవవచ్చును. దానికి lumpsum కూడా ఇచ్చే provision ఉన్నది. ఆ provisions అన్నీ contractors వినియోగించుకొంటూ పని పూర్తిచేయకుండా పోతున్న విషయం ప్రభుత్వానికి తెలుసును. అటువంటి contractors మీద ప్రభుత్వం ఏమీ చర్య తీసుకొనకపోవుటవలన ప్రభుత్వానికి నష్టంవస్తున్నది. డబ్బు వృధాగా ఖర్చు అయిపోతున్నదని మనవిచేస్తున్నాను. గ్రామాలలో అనేక electricity schemes ఉన్నాయి. నగరికి తూర్పుగా ఉండే గ్రామాదులలో సుమారు 150 oil engines పని చేస్తున్నాయి. ఈ ఇంజనులకు పనికివచ్చే oil ఒక gallon ఖరీదు రు. 1-9-0, రు. 1-10-0 ఈవిధంగా అమ్ముడవుతున్నది. ధాన్యం ధరలు పెరుగక పోవుటవలన రైతులు చాలా నిరుత్సాహం చెంది ఉన్నారు. గ్రామాదులలో ఉండే రైతులకు electricity ముఖ్యావసరమని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

Sri P. Gopalu Reddi] [27th March 1956

నగరికి తూర్పున సుమారు 10 మైళ్ల విస్తీర్ణమువరకు మన జిల్లా సరిహద్దు ఉన్నది. అక్కడివరకు మంచినీటికి వసరైన బావులున్నాయని మంత్రిగారికి తెలుసు. మంత్రులకు రైతులవద్దనుండి అనేక విన్నపములు వచ్చినాయి. ఈ విషయముల నన్నింటినీ ప్రభుత్వంవారు గమనించి ఆ ప్రాంతమునకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలని, ఇప్పుడు రేణిగుంటలో యేర్పాటుచేసిన థర్మల్ స్టేషన్ నుండి power వినియోగించుకునేందుకు వీలయిన రీతిగా రైతులకు ఉపయోగపడేటట్లుగా చేయాలని నేను మంత్రిగారిని కోరుతున్నాను. మద్రాసునుండి మనం వినియోగించుకుంటున్న current ఏప్రిల్ 1 వ తేదినుంచి cut చేస్తారని, reduction రాబోతున్నదని యివాళ పేపరులో చదివినాను. ఆ reduction ను గురించి మన ప్రభుత్వం ఏమి ఆలోచించినదో ఇంతవరకూ తెలియదు. ఆ reduction ను భర్తీ చేయుటకుగాను రేణిగుంట నుండి వచ్చే power ను వినియోగించమని నేను మనవిచేస్తున్నాను. ఈ అవకాశం ఇచ్చినందులకు అధ్యక్షులవారికి నా అభివందనము లర్పిస్తూ నేను ఇంతటితో విరమిస్తున్నాను.

Sri B.G.M.A. NARSINGA RAO :—అధ్యక్షా, ఈ electricity demand ను నేను బలపరుస్తున్నాను. రాష్ట్రమంతా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయుటకు విశేషకృషి చేస్తున్న విద్యుచ్ఛక్తి శాఖామంత్రిగారిని, వారి department ఉద్యోగులను నేను అభినందిస్తున్నాను. అంతేకాకుండా మనం తయారు చేసిన స్కీములను సకాలంలో అమలు జరుగుటకు పగలనక, రాత్రనక శ్రమపడి పనిచేస్తున్న వేలాది కార్మికులను కూడా అభినందిస్తున్నాను. ఆ కార్మికులు చేసే పనిని చూసినట్లయితే మనం ఆశ్చర్యపోతాము. పగలనక, రాత్రనక కష్టపడి పని చేయడమే కాకుండా చెట్లనక, పుట్టలనక అడవులలోను, కొండప్రాంతములలోను లైనులు వేయుట మున్నగు కష్టతరమైన పనులుచేస్తున్నారు. ఇది చాలా అమోఘమైనటువంటిపని. వీరందరికి మనం కృతజ్ఞత చూపవలసి ఉంటుందని నాఅభిప్రాయం. ఆంధ్ర రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి సరఫరాకొరకై అపారమైన కృషి జరిగింది. మాచ్ ఖండ్, తుంగభద్ర ప్రాజెక్టుల నిర్మాణదశపూర్తి కావచ్చినది. ఇంక శీలేరు ప్రాజెక్టుఉన్నది. నాగార్జునసాగర్ ప్రాజెక్టుకూడ రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో పూర్తిఅగుటకు ఏర్పాట్లుచేయబడినాయి. ఆంధ్ర రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి విశేషంగా ఉంటున్నందువల్ల electric trains ను నడుపుటకు అవకాశాలుంటాయి అనుకుంటున్నాను. అందుచేత విద్యుచ్ఛక్తి రంగంలో విశేష కృషిచేస్తున్న ఆంధ్ర ప్రభుత్వమును మరొకసారి అభినందిస్తున్నాను. విద్యుచ్ఛక్తి సరఫరా ఎక్కువగా జరుగుతున్నప్పటికీ రైతులు ఎక్కువగా వినియోగించుకొన

లేకపోతున్నారు. విద్యుచ్ఛక్తి యూనిట్ ధర ఇంకా తగ్గించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. లేనిచో రైతులు వినియోగించుకొనలేరు. ఎక్కువగా విద్యుచ్ఛక్తిని ఖర్చుపెట్టేవారికి తక్కువ ధర, తక్కువగా ఖర్చుపెట్టే వారికి ఎక్కువధర అనే పద్ధతి ఇంకా అమలులో ఉండడం చాల శోచనయం.

ప్రభుత్వంవారు ఈ పద్ధతిని మార్చేసి ఎక్కువ విద్యుచ్ఛక్తి ఖర్చుచేసేవారికి ఎక్కువధర, తక్కువఖర్చుచేసేవారికి తక్కువ ధర అనేపద్ధతి అవలంబించినవాడు మన సమ సమాజంయొక్క సిద్ధాంతమునకు అనువుగా ఉంటుందని నా ఉద్దేశ్యం. ఈ విద్యుచ్ఛక్తికి సంబంధించినవి operation and subordinate service, construction and subordinate service అని రెండువిధాలుగాఉన్నాయి. ఈ రెండింటిలోనుకూడ work charged పనివారు, N.M.R. పనివారుకూడా ఉన్నారు. అయితే ఈ operation sub-ordinate service లో 10 సం॥ల నుంచి temporary గా, work charged గా ఏవిధమయిన increments, provident funds లేకుండా service regularisation లేనివారు ఉన్నారంటే చాలా విచారకరమయిన విషయం. Temporary అనే పదానికి ఇంతవరకు సరియైన నిర్వచనంలేదు. వారు ఎంతకాలం ఉన్నప్పటికీ temporary గానే ఉండిపోతున్నారు ఈ Electricity కి సంబంధించినపని ఏనాటికో అయిపోక తప్పదుకదా అని ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యం అనుకొంటాను. అంతవరకు వీరిని temporary గా ఉంచుదామని వారి అభిప్రాయమై ఉంటుంది. 10, 15 సంవత్సరములవరకు అలా temporary గా ఉంచేకన్నా ఒకసంవత్సరం service చేసిన ప్రతివానిని confirm చేసి, అతని service regularise చేసి, రావలసిన provident fund ఇచ్చి, రావలసిన increments ఇస్తూ పని అయిపోయిన తరువాత అతనిని ఉద్యోగమునుండి తీసేస్తే తప్పు ఏమిటి ? ఆవిధంగా ఎంతమంది permanent వారిని తీసివేయడంలేదు ? వీరిని permanent చేయుటకు ఆటంకాలేమి ఉన్నాయి ? ఈ విధంగా temporary అనే ఉపయోగించుటవలన కార్మికులకు దినదిన గండంగా ఉన్నది. Tension increase అవుతున్నది. ఏనాడు ఈ ఉద్యోగం పోతుందో అనే భయంతో కార్మికులు పనిచేయడం జరుగుతున్నది ఈ tension ను relieve చేయాలంటే ఈ temporary కార్మికులలో ఒక సంవత్సరం పనిచేసిన ప్రతివారిని confirm చేయాలి. పని అయిపోయినతరువాత వారిని తీసెయ్య వచ్చును. దానికి ఎవ్వరూ కాదనరు. Temporary అనే పేరుతోటి రావలసిన సౌకర్యాలన్నీ ఆపివేయడం ప్రభుత్వంయొక్క విధానంకారాదు. ప్రభుత్వంవారు ఈ విషయమై శ్రద్ధగా ఆలోచించి తగినకృషి చేస్తారని నేను ఆశిస్తున్నాను.

Sri B. G. M. A. Narasinga Rao] [27th March 1956

తరువాత line staff ఉన్నది. వారికి Factory rules ఇంతవరకు అమలు జరుపుట లేదు. వారు లైనుమీదికి పోతే మళ్లి ఎప్పుడు తిరిగివస్తారో తెలియదు ఈ line staff ఎప్పుడూకూడా హాజరుగా ఉండాలి. ఎప్పుడు అయినా సరే పని చేయుటకు సిద్ధంగా ఉండాలి. Break down ఎప్పుడు వస్తుందో, ఎక్కడ వస్తుందో తెలియదు. అటువంటిపని చేసేవారిక్కూడా regularisation of duty లేదు Overtime work చేసినాసరే అతనికి ఏమీ ఎక్కువ ఇవ్వరు. అతను రాత్రి 12 గంటలకు పడుకున్నాసరే అతనిని లేపి ఫలానా 16వ మైలువద్ద break down వచ్చింది. అక్కడికివెళ్ళి ఆపని చేయమంటే అతను వెంటనేవెళ్ళి చేయాలి. దానికి అదనంగా ఏమీ ఇవ్వరు. ఇంతవరకు overtime charge మున్నగునవి ఏమీకూడ ఇచ్చుటలేదు. ఈ line staff లో పనిచేసేవారిక్కి factory శాసనమును విధిగా అమలుచేసి, పనిచేయవలసినకాలమును నిర్ణయించి వారి service regularise చేస్తేతప్ప మనం వారిక్కి చాలా ద్రోహంచేసినవారము అవుతాము. అందువల్ల ప్రభుత్వంవారు దీనిని సవరించవలసిన అవసరంఉన్నది అని నేను ప్రభుత్వంవారిదృష్టికి తీసుకురావలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

ఈ Department లో చాల దుబారా జరుగుతోందని ప్రతీతిగా ఉన్నది. ఎక్కడ చూసిన Electricity శాఖ van లేవాడబడుతూ ఉన్నాయి. ఎక్కడో పల్లెటూళ్లలో పనిచేస్తూఉండవలసిన Vans అన్నీ పట్టణాలలో officer లకు వాళ్ల భార్యలతో పిల్లలతో బజారుకు shop లకు వస్తూనేఉన్నాయి. ఈ Vans ను ఎక్కడచూచినా తమ స్వంత అవసరాలకు వినియోగపరచుకోవడం జరుగుతోంది. Department పనికి ఎంతమాత్రం ఉపయోగపడడంలేదని చెప్పగలము. కాని అందుచేత ప్రభుత్వం కొంచెము కఠినమైన చర్యలు తీసుకొని ఈ Van లయొక్క ఉపయోగాన్ని క్రమబద్ధంచేసి పూర్తిగా ప్రభుత్వం పనికొరకే ఉపయోగపడేటట్లు చేయవలెనని, ఈదుబారా చాలమటుకు తగ్గేటటువంటి ఏర్పాటుచేయవలెనని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

విశాఖపట్టణం Power House Bezwada లో ఉన్నటువంటి Power House మూసివేయబడ్డాయి. మాచ్ఖండు Power ఉత్పత్తి చేసినప్పటినుంచీకూడా ఈ రెండు Power Houses shut down చేయబట్టాయి. అయితే ఈ పరిస్థితిలో అక్కడ పనిచేస్తున్న కార్మికులస్థితి ఏమైనది, వారిని ఇతరత్రా ఎక్కడైన absorb చేస్తారో, లేక వారికి ఎటువంటి alternate employment, alternate posi-

27th March 1956] [Sri B. G. M. A. Narasimga Rao

tions చూపిస్తారో ఇప్పటివరకుకూడా వారికి తెలియలేదు. వారందరుకూడా చాల ఆందోళన పడుతున్నారు. ఒకప్రక్క మాచ్ ఖండు energy రావడం చాలముదావహం, సంతోషకరమైన విషయం. అయితే మాచ్ ఖండు energy వచ్చినందువల్ల, thermal stations లో పనిచేస్తున్న కార్మికులగతి ఏమౌతుందో తెలియదు. అది అగమ్యగోచరంగాఉంది అందుచేత ప్రభుత్వం వెంటనే తమ Policy నిర్ణయించి పనివారిని ఏ విధంగా చూస్తారో తెలియజేస్తూ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఉద్యోగఅవకాశాలు పెంపొందింప చేయడమే లక్ష్యం కొబట్టి వారినికూడా తీసివేయకుండా వారికి ఉద్యోగ రక్షణఇస్తూ వారికి ఇతరత్రా ఉద్యోగాలు కల్పించే అవకాశాలు కలుగజేయవలెనని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. జీతాలవిషయంలో Payment of Wages Act lines staff కు apply కావడంలేదు. ఫ్యాక్టరీ చట్టం అమలులోలేదు. Payment of Wages Act apply అయ్యేటట్లయితే సమంగా 7 వ తారీకునాటికి జీతాలు ఇచ్చివేయాలి. ఈ Act apply కాకపోవడం వల్ల 15 రోజులు, 20 రోజులు, రెండునెలలు, 3 నెలలుకూడా delay కావడం జరుగుతున్నది. కొన్ని సందర్భాల్లో 6 నెలలవరకుకూడా జీతాలు అందనివాళ్లు కూడా ఉన్నారు. ఏదైన పనికొరకు ఇక్కడికి అక్కడికి పంపిస్తే ఆ పనిచేసిన ఆసామి తన స్వంతసొమ్ము ఖర్చుపెట్టుకొని ఆ పనిమీదవెళ్ళివస్తే T. A లు ఇచ్చేందుకు 6 నెలలు, సంవత్సరము పడుతున్నది. ఇది చాలా విచారకరం. ఈ పరిస్థితులన్ని ప్రభుత్వం గమనించి జీతాలు సక్రమంగా సకాలంలో వచ్చేటట్లు, T. A బిల్లు లన్నికూడా సక్రమంగా సకాలంలో వచ్చేటట్లు ఏర్పాటు చేయవలెననికోరుతూ ఈ Demand ను బలపరుస్తూ విశేషకృషిచేసిన మంత్రిగారిని, Department నుకూడా అభినందిస్తున్నాను.

SRI T. RAMACHANDRA REDDI:—అధ్యక్ష మహాశయా, విద్యుచ్ఛక్తి శాఖామాత్యులుగారు ప్రవేశపెట్టిన demand ను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాను. ఇంతవరకు అనంతపురంజిల్లాగురించి ఆరుగురు మాట్లాడారు; నాతోపాటు ఏడుగురు అవుతారు. అనంతపురం క్షామప్రాంతం కనుక అనంతపురంజిల్లా శాసనసభ్యులు విద్యుచ్ఛక్తి విషయంలో ఎంతో ఆ దుర్దా కనపరుస్తున్నారు. మన విద్యుచ్ఛక్తి మంత్రిగారుకూడా రైతుకుటుంబానికి చెందిన వారు. అందులో ముఖ్యంగా అనంతపురంజిల్లావలె వెనుకబడిన ప్రాంతం అయిన శ్రీకాకుళం జిల్లాకు చెందిన వారే గనుక క్షామ ప్రదేశం అంటే ఏ రీతిగా ఉంటుందో రైతులు ప్రజలు ఏ రీతిగా ఉంటారు అనే విషయం వారికి బాగా

Sri T. Ramachandra Reddi] [27th March 1956

తెలుసు. గత 13 మాసాలలో విద్యుచ్ఛక్తి మన ఆంధ్రదేశంలో విపరీతంగా వ్యాపకమైన విషయం అందరికీ తెలిసినదే. అందువల్లనే గత ఎన్నికలలో ఎక్కువ మంది శాసనసభ్యులు కాంగ్రెసు పరంగా జయం పొందడానికి కూడా అవకాశం కలిగిందనే విషయం అందరికి తెలుసు. అనంతపురం జిల్లాలో మాకు ఏలాటి నీటి వనరులు లేవు. ఎక్కువగా మేము బావి సేద్యంవల్లనే ఆధారపడి ఉన్నాము. మా ప్రాంతంలో బావులు 100, 120 అడుగుల లోతువరకు ఉన్నాయి. ఇటువంటి పరిస్థితిలో సేద్యానికి ముఖ్యంగా మోటలోలుకొనే బీదరైతాంగానికి ఎంత కష్టమో మీరే ఆలోచించుకోవాలి. ఇటువంటి ప్రదేశానికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయవలెనని నేను ఒక సంవత్సరం నుంచికూడా మంత్రిగారికి విన్నవించుకొంటున్నాను. Chief Engineer గారికికూడా దరఖాస్తు పంపుకొన్నాము. ఈ విషయంలో ప్రభుత్వం ఇంకా investigation లోనే ఉన్నదని నాకు కొన్ని ఉత్తరాలుకూడా వస్తున్నాయి. ఈ investigation ఎంత కాలం పడుతుందో తెలియక చాల ఆదుర్దా పడుతున్నాము. కాబట్టి ఈ విషయంలో కొంచెము శ్రద్ధ వహించి వెనుకబడిన ప్రాంతమైన అనంతపురం జిల్లాకు కొంతవరకు ఏమైనా సదుపాయాలు చేయాలని కోరుతున్నాను. Anantapur అంటారు. poor అంటేనే బీదరికము. కాబట్టి పేరులోకూడా మేము చాల బీదవారము. గనుక ఈ విషయంలో మీరు కొంచెము ఎక్కువ శ్రద్ధ వహించి సదుపాయాలు చేస్తారని నేను ఆశిస్తున్నాను. ఈ అవకాశం ఇచ్చినందుకు స్పీకరుగారికి అభినందనలు.

Sri. P. PARTHASARATHI :—అధ్యక్షా, విద్యుచ్ఛక్తి శాఖామాత్యులు ప్రవేశపెట్టినటువంటి Demand ను నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. చాల సమర్థతతో చురుకుగా విద్యుచ్ఛక్తి ప్రణాళికను పెట్టి అమలు జరిపేదాని కొరకు వారెంతో ప్రయత్నం చేస్తున్నారు అందుకు వారిని అభినందించవలసి ఉంది మాచ్‌ఖండ్, తుంగభద్ర మొదలైన ప్రాజెక్టులన్నింటిని కూడా శీఘ్రగతిని సమాప్తిచేసి దేశానికి అవసరమైనటువంటి ఈ విద్యుచ్ఛక్తి సరఫరాకై విషయంలో చాల జాగ్రత్తగా మెలగుతున్న సంగతి అందరికి తెలుసు. ఈ విషయంలో విద్యుచ్ఛక్తి శాఖకు సంబంధించినటువంటి ఉద్యోగు లందరినికూడా నేను అభినందిస్తున్నాను. దేశాభిమానంతో చురుకుగా ఈ ప్రణాళిక అన్నిటిని సమాప్తి చేయవలెననేటువంటి సదుద్దేశ్యంతో వారందరుకూడా కృషి చేస్తున్నారు. వారి నేవిధంగాకూడా తప్పులు పట్టేదానికి అవకాశంలేదు. డబ్బుయొక్క అభావంవల్ల ఏమైన వెనుకబడితే తప్ప వారియొక్క ప్రయత్నంలో లోటులేదనికూడా నేను చెప్పగలను. మా కడప జిల్లాలో, వెనుకబడిన జిల్లాలలో, క్షామ ప్రాంతా

27th March 1956] [Sri P. Parthasarathi

లలో కూడా ఎప్పుడు ఏఏ ప్రాంతానికి వీలవుతుందో ఆ ప్రాంతానికి విద్యుచ్ఛక్తి సరఫరాచేయాలనే ప్రయత్నాలుకూడా జరుగుతున్నాయి. రాజంపేట నియోజక వర్గానికి విద్యుచ్ఛక్తి సరఫరా విషయంలో ప్రభుత్వంవారు చూపినటువంటి అపరాశి మానాలకు వారిని నేను కొనియాడుతున్నాను. అయితే రాజంపేట, కోడూరు పంచాయతీకి ఇవ్వబడిందేగాని వ్యవసాయానికి, వ్యవసాయ పరిశ్రమను ప్రోత్సాహ పరచేదానికి కావలసినటువంటి ప్రయత్నాలు కూడా ఏమిలేవు మంత్రిగారు ఒక సారి మా తాలూకా పర్యటనకువచ్చారు. అప్పుడు ప్రజలు చూపినటువంటి ఆసక్తి కూడా వారు ప్రత్యక్షంగా చూసి ఉన్నారు. విద్యుచ్ఛక్తి సరఫరా విషయంలో వ్యవసాయానికికూడా త్వరగా supply చేసేటటువంటి విధానాన్ని ప్రభుత్వము వారు వెదకి దానిని అమలులో పెట్టేటటువంటి ప్రయత్నం చేయవలెనని మంత్రి గారిని ప్రార్థిస్తున్నాను.

ముఖ్యంగా పండ్ల ఉత్పత్తి మా తాలూకాలో ఎక్కువగా ఉన్నది. మా తాలూకాలో irrigation కు, బావులపైనే ఆధారపడవలసియుంటుంది. అందుచేత విద్యుచ్ఛక్తి యొక్క సహాయంచేతనే ఏదైనా వ్యవసాయం అభివృద్ధి చేసుకోనే దానికి వీలు ఉన్నదిగాని మరొకవిధంగాలేదు. పెద్ద projects ఏవి అక్కడలేవు. ఏదో బాదెనగడ్డ project, వాగేటికోన project కావాలని కోరుతున్నాము. సంజీవరెడ్డిగారు చేస్తామని వాగ్దానం ఇచ్చారు. అవి ఎప్పుడు వస్తాయో తెలియదు. కాని, ఇప్పుడు మట్టుకు బావులమీదనే ఆధారపడేటటువంటి మా తాలూకా గురించి విద్యుచ్ఛక్తి సరఫరా విషయంలో ప్రభుత్వంవారు ఎక్కువ శ్రద్ధ వహించవలసిఉన్నది. ముఖ్యంగా, నందలూరు, పుల్లంపేట, ఓబిలి, చిట్వేలి. పిర్కాలలో దీని అవసరం చాలా ఉన్నది. ఇవన్నీకూడ intensive cultivation చేసే ప్రాంతాలు కాబట్టి విద్యుచ్ఛక్తి సరఫరా విషయంలో వచ్చే సంక్రాంతికైనా ఈ ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి సరఫరా చేయించే విషయములో ప్రభుత్వము శ్రద్ధ వహిస్తారని ఆశిస్తూ, వారు ఈ విషయములో చేసినటువంటి అమోఘసేవకు వారిని అభినందిస్తూ విరమించు కొంటున్నాను.

Sri VIJAYABHASKARA REDDI :—అధ్యక్షా, ఈనాడు ప్రవేశ పెట్టినటువంటి ఈ డిమాండును హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. నిజంగా ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత ప్రతి ఆంధ్రుడు గర్వించదగిన అభివృద్ధి ఈ electricity విషయములో జరుగుతూ వచ్చింది. ఈ అభివృద్ధి ఇదేవిధంగా జరగాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వ దృష్టికి కొన్ని సూచనలు తీసుకొనిరాదలచాను. ఈ

Sri Vijayabhaskara Reddi] [27th March 1956

ఉదయం A. C. సుబ్బారెడ్డిగారు మాట్లాడుతూ కొన్ని విషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చారు. అవంతా వింటూ ఉంటే చాలా హృదయ విదారకంగా ఉండినది. అటువంటి విషయాలు జరుగుతూ ఉంటె కూడ శ్రద్ధ తీసుకోకపోవడం అంటె చాలా విచారకరంగా ఉన్నది. కనక ప్రభుత్వము అంత పెద్ద మొత్తాలు దుర్వినియోగమయ్యే విషయాలు వెంటనే విచారణచేసి, వానికి సంబంధించిన వారిని వెంటనే శిక్షించి, ఇకముందు అటువంటి లోపాలు జరగకుండా, మనము ఖర్చుపెట్టే డబ్బు చాలావరకు ఉపయోగపడేటట్లు చేస్తారని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత ఈ schemes విషయంలో ఈమధ్య remuneration ను ముఖ్యంగా లెక్కవేస్తున్నారు. ఈ remuneration కనీసం 10 percent అయిన ఉండాలని ప్రభుత్వము ఈ schemes ను examine చేస్తూ ఉన్నది. కాని వెంటనే remuneration రావాలంటే, ముఖ్యంగా వెనకబడిన జిల్లాలలో చాల కష్టంగా ఉంటుంది. ఈ ప్రాంతాలలో నిదానంగా, కొన్ని సంవత్సరములు గడచిన తరువాతగాని remuneration రాదు. కనుక వెనకబడిన జిల్లాలలో ఈ remuneration కొంత తక్కువగా ఆశించి, కనీసము 8 percent అయినా పెట్టి దాన్ని ప్రోత్సహిస్తే, ఈ electricity ఉపయోగము ప్రజలకు తెలిసి ఈ కరువు కాటకాలకు గురికాకుండా ఉండేందుకు వీలుంటుంది. కనుక ఈ remuneration ను వెనుకబడిన ప్రాంతాలలో తగ్గించవలెనని కోరుతున్నాను. అదేవిధంగా, ఇప్పుడు మాచ్‌ఖండ్ తయారైంది. తుంగభద్ర 1957 సంవత్సరానికి తయారవుతుంది. నందికొండ ఇప్పుడే ప్రారంభం చేశాము. అన్నిటికంటె మించిన శ్రీశైలం స్కీము ఒకటి ఉన్నది. అది మన ఆంధ్రదేశంలో చాలా ముఖ్యమైన స్కీముగా తయారవుతుంది. ఇప్పుడు అక్కడ రోడ్డుకూడ తయారైంది కనుక engineers ను ప్రత్యేకంగా అక్కడికి పంపించి ఆ scheme ను examine చేయించి అది తీసికోవలెనని, మన ఆంధ్ర దేశములో ఉండే hydro-electric schemes అన్ని తయారై వాడుకకు వచ్చే లోపల దేశమంతటా ఒక net work గా తయారు చేయవలసియుంటుందని మనవిచేస్తున్నాను. కనుక తాత్కాలికంగా గాక దూరదృష్టితో ఈ పని అంతా తయారుచేయవలెనని కోరుతున్నాను.

ఇక, మా నియోజకవర్గంలో, ఎమ్మిగనూరు నుంచి కర్నూలువరకు Jog line ఒకటి పెద్దది ఉన్నది. ఎమ్మిగనూరుకు, కర్నూలుకు మధ్యన కోడుమూరు అనే గ్రామము 10 వేల జనాభా గలిగినటువంటిది ఉన్నది. ఈ స్కీము మూడు సంవత్సరముల క్రిందట examine చేశారు. కాని ఇంతవరకు అది execution

27th March 1956] [Sri Vijayabhaskara Reddi

లోకి రాలేదు. అంతే కాకుండా ఆ మధ్యలోనే, పెలెగల్, పొద్దపాడు పల్లా అని కొన్ని గ్రామాలు 4 వేలు, 5 వేలు జనాభా గలిగినవి ఉన్నాయి. పెలెగల్ అనే గ్రామములో దాదాపు నూరు బావులున్నాయి. ఆ బావుల క్రింద ఒక ఎకరా, ఒకటిన్నర ఎకరా చేసుకొనేటటువంటి బీదప్రజలు చాలామంది ఉన్నారు. ఈ స్కీము లన్నిటినీ 3,4 సంవత్సరముల క్రితం examine చేశారు. కాని ఇంతవరకు ఎందుకు జాప్యం జరుగుచున్నదో తెలియడంలేదు. వీటన్నిటినీ తొందరగా ప్రభుత్వము అమలుజరిపి వెనుకబడిన జిల్లాలను అభివృద్ధి చేయవలెనని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI P. ANTHONY REDDI :—Mr Speaker, Sir, it is said that even the best of men commit often sins of omission. Our Minister for Electricity who is sturdy and dynamic with an enthusiastic team of engineers and assistant engineers no doubt cannot overdo anything in this question of electrification of our State. But they have committed certain mistakes or certain sins of omission Now in our State as well as in the whole of India, there is a race for electricity ; on the one side we have industries seeking electricity to run the big machines in order to earn lakhs and lakhs of rupees ; on the other side we have towns people who, just to increase their luxuries, to have more electric fans and probably to have more electric heaters and to have better standard of living, are racing for electricity. Lastly, Sir, there is the poor ryot in the villages who is also seeking electricity in order to bale out water for his fields to grow more paddy from each acre of land he cultivates. Sir, our Minister for Electricity is one who has done much service for the uplift of farmers and we know that he has been working under the leadership of Prof. Ranga who himself is probably the greatest Kisan leader in our country. So, a worker like our Minister who ought to have had a soft corner for the poor farmer is somehow or other not doing much for him. In this race for electricity, only the most powerful man will get it. Industrialist is getting electricity , towns are being electrified ; only the poor ryot is not being given sufficient current

Sri P. Anthony Reddi] [27th March 1956

for his purpose. I expected that our Minister for Electricity who has, as I said in the beginning, a soft corner for the poor man, would help us But unfortunately he is not doing as much as we expected from him. Sir, taking the case of my own taluk, Anantapur, we see electric lines running here and there from one corner of the taluk to the other, from Gooty to Pamidi, from Pamidi to Anantapur and from Anantapur to Dharmavaram, while only a few ryots are given current for lift irrigation The other day, a few of us met the Hon Minister and he was of-course very enthusiastic and very sympathetic towards us. But unfortunately he told us, 'please give us money and we will do anything for you' Sir, it was at the end of the financial year and therefore we could not do anything to supply him the necessary funds. But now a large sum, nearly Rs. 13·0 crores, is at his disposal and we hope that now at least his generous heart for the poor ryot will be exuberant and in a few months' time Anantapur taluk will be electrified, and the poor ryot who produces only 20 bags of paddy per acre will be made to produce at least 25 bags of paddy per acre by the supply of electric power for lift irrigation. Thank you, Sir.

*SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ విద్యుచ్ఛక్తిశాఖ చాలా ఎక్కువగా విజృంభించి పనిచేస్తున్నది. అది ఆంధ్రదేశము గర్వించదగినటువంటి విషయము. అయితే ఈ సందర్భంలో ఒకవిషయము మనవి చేస్తున్నాను. కొంతమంది లావుగా ఉన్నవారిని చూచి, వారు చాలా బాగుగా ఉన్నారని అనుకొంటున్నాము. కాని అటువంటివారు ఎప్పుడో ఒకతూరి heart failure వచ్చి ఎగిరిపోవడంకూడ జరుగుతుంది. పోనీ సన్నగా ఉన్నవారైనా బాగుంటారేమో అనుకుంటే, వాళ్లు క్షయ వచ్చేని చచ్చిపోతున్నారు.

MR. SPEAKER :—You are an exception.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అయితే, ఆంధ్ర దేశము క్షయవ్యాధులతో బాధపడడంలేదనేది అందరికి తెలుసు, అందుచేత

ఇప్పుడు electricity శాఖ చాలా పెద్దగా పెరిగిపోతూ ఉంది. గనుక దీనికి heart failure ఏమైనా జరుగుతుందేమో చాలా తీవ్రంగా ఈ Electricity Department ఆలోచించవలసిన అవసరమున్నది. మనము దీనికి చాలా డబ్బు ఖర్చుచేశాము. ఈ డబ్బు అంతా సద్వినియోగమయి సరియైన పద్ధతిలో నడుస్తున్నదా అనేది గమనించవలసియున్నది. రెండవది, వస్తున్నటువంటి electricity అంతా సద్వినియోగమవుతున్నదా అనేది చూడవలసియుంటుంది. మూడవది, అసలు ఇంత తయారవుతున్న electicity ని ఉపయోగపరచడానికి మనకు కావలసిన పరిశ్రమలుగాని మరేవైనాగాని పెట్టుకోకపోతే, దీనియొక్క పరిణామం ఎక్కడికి పోతుంది అనేది చాలా తీవ్రంగా ఆలోచించవలసియుంటుంది. నిజంగా ఈ రెండు, మూడుసంవత్సరాలలో electricity supply చూస్తే చాలా బాగున్నది. బహుశా ఆ department కూడ బాగా కృషిచేస్తున్నదేమో అని అనుకొంటాను. అయితే నా అభిప్రాయములో ఆ stores వాటి విషయములో ఏమి checking లేదనుకొంటాను. సరియైన checking ఉన్నట్లయితే అంతకన్నా ఎక్కువపని చేయడానికి వీలు అవుతుందని నమ్ముతున్నాను. ఇప్పుడు చాలా waste జరుగుతున్నది. తరువాత ఒక్కొక్క వస్తువు వచ్చేటప్పటికి ఎంతో time పడుతుంది. అన్ని ready గా ఉన్నట్లే అగుపడుతుంది. ఒక్కటి ఉండదు. దాన్నిగురించి ఆ staff ను అడిగితే, "మేము సరాసరి ఇంజనీర్లను అడిగితే, వారు పోట్లాడతారు, అందుచేత మీరేపోయి మాట్లాడండి" అంటారు. వీళ్లకు ఒకప్రక్కన ఆ విధంగా అడిగే దానికి దమ్ములులేవు. మరోప్రక్క అడిగితే, "మీరు చెప్పకపోతే వాళ్లకు ఎట్లా తెలిసింది" అని అంటారని భయము. ఈ పరిస్థితులలో work సరిగా జరగడంలేదని మనవిచేస్తున్నాను. డబ్బు ఎంత ఖర్చుచేస్తున్నప్పటికి, ఆ డబ్బు సరిగా సద్వినియోగమవుతున్నదా, ఆ పని సరిగా జరుగుతున్నదా అనేది చూడవలసియుంటుంది.

కనుక quantitative value నే కాకుండా, qualitative value కూడ దీంట్లో చూడవలసియున్నది. ఇప్పుడు Public Works Department లోను, ఇంకా ఇతర departments లోను చాలాడబ్బు ఖర్చుపెట్టడం జరుగుతున్నది. కాని దీంట్లో చాలా అన్యాయము, చాలా దుర్వినియోగము జరుగుతున్నది. Estimates వేసేదాంట్లో చాలా అన్యాయం జరుగుతున్నది. దీంట్లో మొదట estimates అన్ని ఎక్కువ వేశారు అన్నారు. శ్రీ కండవరెడ్డిగారు ఒకసారి ఇంజనీర్లనుద్దేశించి బహు ఉపన్యసించారు. ఎక్కువ estimates వేస్తే పని ఏమైనా ఎక్కువగా అగుపడుతున్నదా అంటే లేదు. Estimates జాగ్రత్తగావేస్తే పనికూడ సరిగా ఉంటుంది. Estimates abnormal గావేస్తే, అది ఇతర

Sri Vavilala Gopalakrishnayya] [27th March 1956

దేశాలకు చూపించడానికే పనికివస్తుంది తప్ప అది వాస్తవానికిజరుగదు. అంత ఖర్చు పెట్టాలంటే బడ్జెటులో చాలా అవుతుంది. ఇది శ్రేయోరాజ్యంగనుక, దీనికి డబ్బు చాలా జాగ్రత్తగా వాడవలసిన అవసరమున్నది. రేపు Estimates Committee వచ్చినపుడు ఇవన్నీ చూస్తుందనుకోండి. అయినా నేను మనవిచేసేది, ఇది కాకుండా, దీనికిగా advisory boards ను ఎప్పటికప్పుడు ఏర్పాటుచేసి, Technicians, Non-Technicians కలసి ఈ stores వ్యవహారమంతా చూస్తూ బాగుంటుందనుకొంటాను, ఇప్పుడు contractors మీద, Electricity Department వాళ్లమీద చాలా అనుమానం ఉంటుంది చాలా reports కూడ వస్తున్నాయి, enquiries కూడ జరుగుతున్నాయి. వాటిని నేను ముందుగా చెప్పడం సబబుకాదనుకొంటాను. రెండవది, ప్రభుత్వము electricity policy తీసుకొన్నప్పుడు, industrial policy మరొకవైపు తీసుకోవాలి. బహుశా అది దీంట్లోది కాదంటారేమో, అయినా అది allied subject. Industrial and electricity development ఒకేదారిపోకపోతే ప్రయోజనంలేదు

ఇప్పుడు నేను ఒక ఉదాహరణ చెబుతున్నాను. గుంటూరునుంచి నరసరావుపేటకు ఒక లైను వేశారు. అది ఫిరంగిపురంవరకు వ్యవసాయానికి ఉపయోగించేదానికి యింకొక లైను వేస్తామనిఅన్నారు. తిరువాత నర్సారావుపేటనుంచి ఫిరంగి పురంవరకూ వెనుకకు లైను వేయాలని అన్నారు.

THE HON. SRI G. LATCHANNA:—33 K. V. line గుంటూరునుంచి వెళ్లుతుంది. దాని ద్వారా గ్రామాలకు electricity సప్లయి చేయటానికి వీలులేదు. అందువల్ల 11 K. V. line ను మరల తీసుకొని రావాలి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అది ఏదో, Technical side కాబట్టి అది నాకు బాగా తెలియదు. రెండు లైనులు మాత్రము వేస్తున్నారు. High Voltage కు, Low Voltage కు తేడా ఉంటుందికనుక, రెండు లైనులు వేరు వేరుగా వేస్తారని ప్రజలు అడిగితే చెప్పాను. కాని లైను వేస్తామని చెప్పటమేగాని, ఒక లైనుగూడ కనబడదు. యిప్పటికి మూడు సంవత్సరాలుగా లైనువేస్తామని చెప్పడము, వెయ్యకపోవడము కనబడుతున్నది. ప్రతి సంవత్సరము స్కీముల జాబితాలో సంవత్సరము ఆరంభములో కనబరుస్తారు. సంవత్సరము ఆఖరు అయ్యేటప్పటికి, వచ్చే సంవత్సరము జాబితాలో

27th March 1956] [Sri Vavilala Gopalakrishnayya

మొదట్లో కనబరచడము కనబడుతున్నది. మొన్న యిక్కడ ఎసెంబ్లీ సమావేశము జరుగుతున్నప్పుడు చూచాను. సామాగ్రిమాత్రము వచ్చింది. గుంటలు మాత్రము త్రవ్వేరు. "లైను యీసారి అయినా వేస్తారా" అని అడిగితే, "ఏమో, యింకా నమ్మకము లేదండి" అని అక్కడ పనిచేసేవాళ్లు అన్నారు. అది నా నియోజకవర్గమునకు సంబంధించిన ప్రాంతము, అక్కడి ప్రజలు నన్ను electric line వస్తుందా రాదా అని అడుగుతున్నారుగనుక, నేను ప్రత్యేకించి యిప్పుడు ఈ cut motion యివ్వవలసి వచ్చింది. తరువాత నర్సారావుపేటకు, సత్తెనపల్లికి సరాసరి లైను వెళ్లవచ్చు. కాని అది వేయడములేదు. అక్కడ మాకు సత్తెనపల్లి టౌనులో electricity సప్లయి చేయటానికి line వేస్తాము, electricity కావలసినవారు అందరు ధరఖాస్తులు పెట్టుకోండి, అని చెప్పితే, చాలామంది ధరఖాస్తులు పెట్టారు. డబ్బుకూడ రెండువందలు, మూడువందలు deposits కట్టారు. కొంతమంది electricity వస్తుందనే, ఆశతో, వడ్డీలకు గూడ అప్పుతెచ్చుకుని కట్టారు, దరఖాస్తులు పెట్టుకుని యిప్పటికి ఆరు నెలలో 8 నెలలో కావచ్చింది. ఇంతవరకు line గూడ రాలేదు. Electricity కు లైను యింకా రాలేదు, ఎందుకని నన్ను ప్రజలు అడిగితే, నేను Electricity Department కు వ్రాశాను ఇంతవరకు line వేయలేదు. ప్రజలు తొందర పడుతున్నారు. అక్కడ సత్తెనపల్లిలో రాలేదని, యిక్కడ అనంతపురంలో రాలేదని, యింకొక చోటులో రాలేదని అంటే, యిక యీ electricity క్రింద ఖర్చుచేసే సొమ్ము అంతా ఎట్లా ఖర్చు అవుతున్నదని, ప్రభుత్వము అనవచ్చు. ప్రభుత్వము ఖర్చుచేయడము లేదని నేను చెప్పడములేదు. కాని electricity ముందు ఎక్కడికి అయితే వెళ్లాలో, అక్కడికి వెళ్లడములేదు. లెక్కలు మాత్రము బాగానే వ్రాస్తున్నారు. Reports చూస్తే best గా ఉంటవి. Impression అంతకంటే బాగా ఉంటుంది. కాని execution చూస్తే అది నిద్రపోతూ ఉన్నదని మాత్రము నేను చెప్పవలసి వస్తున్నది.

తరువాత temporary service అని అంటున్నారు. ఇక్కడ ప్రభుత్వానికి temporary service అని అంటున్నారు. ఇక్కడ temporary service ఆనేది ఎట్లా ఉన్నదో, అక్కడ మాకు పోరంబోకులుగూడా అట్లాగే ఉన్నవి. నాగార్జున సాగర్ ప్రాజెక్టుపనులు ప్రారంభించారు. ఆ పనులుచేయడములో చాలా తొందర తొందరగా జరుగుచున్నవి. అంతత్వరలో పనులు జరుగుచున్నవి అంటే, మాకు ఎంతో ఆశ్చర్యముకలిగింది. కాని అంత త్వరత్వరగా పనులుచేయిస్తే, efficiency

Sri Vavilala Gopalakrishnayya] [27th March 1956

దెబ్బతింటుందేమోనని నా అభిప్రాయము. ఈవిధముగా ఏపని అయినా అవసరపడి చేయడము, తరువాత అది సరిగా కుదరలేదనో, పనికిరానిదనో, లేక ఇంజనీరు ఒప్పుకోలేదనో, యీవిధముగా తొందరపడి చేసిన కారణములవల్ల, అది ఊడదీసి మరల కట్టడము అనేది వస్తే, అంతవరకు ఖర్చుపెట్టినది ప్రభుత్వానికి నష్టమేగదా! గనుక ఇంత తొందరలో పనులు జరిపించవలసిన అవసరము యేమి వచ్చింది? బాగా ఆలోచించి పనులు చెయించవచ్చునుగదా! ఇప్పుడు బెజవాడనుంచి నాగార్జునసాగర్‌కు High voltage line వేస్తామని అంటున్నారు. కాని మాచ్‌ఖండుదగ్గర Electric Power Station తయారైతే, దానిని నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు తీసుకొనిరావాలని యింకొక proposal ఉన్నది. ఆ proposal ఉన్నప్పుడు మరల బెజవాడనుంచి నాగార్జునసాగర్‌కు వేరె లైను ఎందుకు? ఈ లైను మాచ్‌ఖండునుంచి వచ్చేలోగా వేస్తే, తరువాత అదివస్తే, యిది అంతా waste యే కదా! తరువాత అది ఊడదీయవలసినదేగదా! కాబట్టి తొందరపడి పనులు చేయడము మంచిదికాదు అని నా అభిప్రాయము. ఒకేసారి మాచ్‌ఖండునుంచి వేస్తే బెజవాడనుంచి నాగార్జునకు వేయడము, దానికి ఆ ఖర్చు చేయకుండా తప్పిపోతుందికదా! ఇప్పుడు మనము Industries, Agriculture యీ రెండు ముందు అభివృద్ధిచేసుకోవాలని అనుకుంటున్నాము. ఈవిషయమును Cabinet level లో ఆలోచించవలెనని అంటున్నాను. Agriculture క్రింద 10% కూడ electricity సప్లయి కావడము లేదని యింకొక మిత్రులు ఎవరో చెప్పారు. నిజమే. 10% కాదు, 3% కూడ రాకుండా పోవచ్చు. కాని మనకు యిప్పుడు పెద్ద electric power వచ్చేటప్పుడు Industrial గా గాను, agricultural గా గాను రెండువిధాలకూడా develop చేసుకోవాలి. కాబట్టి యీ electricity ని వీలు అయినంత ఎక్కువగా ఉపయోగించుకోవాలని అంటున్నాను. ఆవిధముగా ఉపయోగించుకోకపోతే, electricity క్రింద పెట్టినఖర్చులకు return రాకపోతే, State Government ఆర్థికంగా దెబ్బతింటుందేమో ననే అనుమానము నాకు కలుగుతున్నది. కాబట్టి Electricity Scheme ను మనము తప్పకుండా ముందుకుతెచ్చుకుని అన్నివిధాలా develop చేసుకోటానికి ప్రయత్నించాలని అంటున్నాను. నేను ఈ విషయములో cut motions ను ఇచ్చాను. వీటికి మంత్రిగారు సమాధానముచెబుతారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

* SRI Y. CHANNIAH :—అధ్యక్షా! విద్యుచ్ఛక్తి మంత్రిగారు ప్రవేశ పెట్టిన Demand ను నేను బలపరుస్తూ, ఒక్క విషయము

27th March 1956] [Sri Y. Channiah

మాత్రము నేను మనవిచేయదలచుకున్నాను. క్రిందటి సంవత్సరపు బడ్జెటు సమావేశ సందర్భములో నేను మా రేపల్లెటౌనుకు electricity సప్లయి కావలెను, త్వరలో దానికి స్కీము ప్లానుచేసి సప్లయిచేయించవలసినదిగా కోరినాను. మరల యీ సంవత్సరపు బడ్జెటు సందర్భములో చెప్పాను ఇంతవరకు రేపల్లెటౌనుకు electricity యివ్వలేదు. నేను మంత్రిగారిదృష్టికి ఎన్నిసార్లో యీ విషయమును తెచ్చాను. రేపల్లెతాలూకా చాలా వెనుకబడిన తాలూకా, electricity supply చేసే విధానము ప్రభుత్వము సరియైనపద్ధతిలో జరుపుతున్నట్లులేదు. ఎందుకంటే, కొన్ని జిల్లాలలో, గ్రామాలలోను కొన్ని జిల్లాలో జిల్లాకేంద్రాలలో electricity సరిగా సప్లయి కావడము లేదు. మా రేపల్లెటౌనుకే యింతవరకు సప్లయిచేయలేదు అది తాలూకా కేంద్రమని ప్రభుత్వానికి తెలుసును వ్యవసాయమే ఆ తాలూకాలో ఎక్కువగా జరుగుతున్నదనిగూడ తెలుసు. అలాంటిచోట electricity లేదంటే, చాలా విపరీతముగా ఉన్నది. మా రేపల్లెటౌనకు electricity యిస్తామని చెప్పడమువల్ల, అక్కడ ప్రజలు చాలామంది దరఖాస్తులు పెట్టుకొనియున్నారు దరఖాస్తులు పెట్టుకున్నప్పటికీనీ, electricity కి శాంక్షనుచేయలేదు. ఈ విషయమును గురించి ఆర్థిక మంత్రిగారికిగూడా అనేకసార్లు చెప్పియున్నాను. ఇప్పటికైనా త్వరలో ఏర్పాటుచేస్తారని ఆశిస్తున్నాను. Electricity supply చాలా భాగము దుర్వినియోగము అవుతున్నదని మిత్రులు చాలామంది యీ సభలో చెప్పారు. ఇక్కడ ఉపన్యాసాలు చేయడమువల్ల లాభములేదు. ఎక్కడెక్కడ ఎ విశేషముగా దుర్వినియోగము అవుతున్నదో, అది అంతా శాసనసభ్యులమైన మనము ప్రభుత్వము దృష్టికితెచ్చి, యీ అవినీతిని పోగొట్టేటట్లుగా తోడ్పడాలని అంటున్నాను. సభ్యులముఅయిన మనమే కొంతవరకు ఏకమై ప్రయత్నిస్తే, డిపార్టుమెంట్సులో జరిగే అవినీతి తప్పకుండాపోతుంది.

మా రేపల్లెతాలూకా వ్యవసాయము ప్రాధాన్యముగా జరిగేతాలూకా కాబట్టి అక్కడ పంచదారఫ్యాక్టరీ ఒకటి ఏర్పాటుచేస్తున్నారు. Industrial గా వృద్ధి కాబోయేతాలూకా కాబోతున్నది. ఇదివరలో రేపల్లెకు electricity scheme ను అమలుపరిస్తే, return 10% మాత్రమే వస్తుంది. 11% అయినా రావని, యీ విధముగా యీ స్కీమును estimate చేయడములో ఉద్యోగస్థులు తప్పులుగా లెక్కలు చూపించడమువల్ల, యింతవరకు మాకు electricity శాంక్షను చేయలేదు. మా తాలూకాలో పంచదార ఫ్యాక్టరీ కట్టబోతున్నారు. Industrial గా వృద్ధికాబోతున్నది. రేపల్లెతాలూకాలోనే సుమారు రెండులక్షలకుపైగా జనాభా

Sri Y. Channiah] [27th March 1956

ఉంటారు. పెద్ద business కంటరు. అటువంటిచోట్లలో electricity ఎవరూ ఉపయోగించరు అంటే, ఎవరూ నమ్మరు. ఎవరైనా ఆ విధంగా అభిప్రాయపడితే, అది తప్పు అభిప్రాయమనే చెప్పగలను. Electricity రాలేదని ప్రజలలో చాలా ఆందోళనగా ఉన్నది. Electricity శాఖ మంత్రిగారు ఒక పర్యాయము మా శేపల్లెవైపుకువచ్చి పర్యటనచేస్తే, అన్ని సందర్భాలు వారికే బోధపడుతవి. కాబట్టి శేపల్లెకొనుకు, తాలూకాకు Electricity line వెంటనే వేయాలని కోరుతూ, అధ్యక్షులవారు నాకు యీ అవకాశము యిచ్చినందులకు, వారికి నా కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తూ విరమిస్తున్నాను.

Sri K. VENKATARATNAM —అధ్యక్ష మహాశయా! ఈనాడు మన విద్యుచ్ఛక్తి శాఖామంత్రిగారు ప్రవేశపెట్టిన Demand ను నేను పూర్తిగా బలపరుస్తున్నాను, ఈనాడు కేటాయించిన డబ్బు శాసనసభ్యులు కోరుతూయున్న అన్ని scheme లూ చేయించాలంటేచాలదు. గ్రామాలకు విద్యుచ్ఛక్తి supply చేయుటకు బడ్జెటులో డబ్బులేకపోయినందున మన మంత్రిగారు Delhi వెళ్ళి ఏదో విధంగా తంటాలుపడి దాదాపు 50 లక్షల తీసుకువచ్చి అదనముగా పెట్టిన ఖర్చును సరిపెట్టియున్నారు. అదికూడా ఇప్పుడు చాలదు. ఈ సంవత్సరం విద్యుచ్ఛక్తికి కేటాయించిన డబ్బుచూస్తే ఏ 5, 6 మాసాలలోనే ఖర్చుఅయిపోయేటట్లుందని మంత్రిగారు సెలవిచ్చారు. ఇండియా గవర్నమెంటు వారిదగ్గరనుంచి మళ్లీ కొంత డబ్బు కోరుతున్నామని మంత్రిగారు డిమాండుమీద మాట్లాడుతూ సెలవిచ్చారు. నాగార్జునసాగర్‌కు సప్లయిచేయడానికి 96 లక్షలు, గరివిడిలో Manganese factory కి సప్లయిచేయుటకు 75 లక్షలు కోరుతున్నామన్నారు. ఒకకోటి 75 లక్షల రూపాయలు గ్రామాలలో యీ సంవత్సరం విద్యుచ్ఛక్తి వ్యవసాయానికి ఉపయోగించుటకు రైతులకు supply చేస్తామని మంత్రిగారు సెలవిచ్చారు, చాలా సంతోషం ప్రజలకోరికను, demand ను దృష్టిలో ఉంచుకుని విద్యుచ్ఛక్తిశాఖామాత్యులు ఉత్సాహంగా చురుకుగా పనిచేస్తున్నందులకు వారిని అభినందిస్తున్నాను. Upland ప్రదేశాలలోని రైతులకు electricity చాలా అవసరం. ప్రజల దారిద్ర్యం పోగొట్టి ప్రజల జీవిత ప్రమాణం పెంచాలంటే ఈ మెట్టప్రదేశాలలో రైతులకు విద్యుచ్ఛక్తిద్వారా అన్ని సౌకర్యాలు కల్గజేయ్యాలి. ఈ upland ప్రదేశాలలో వర్షాలు లేకపోతే ఎడ్లతో మోటతోలి పంటలు పండించవలసినప్పుడు రైతులు చాలా కష్టపడుతున్నారు. మీరు విద్యుచ్ఛక్తి ఇచ్చినట్లయితే నూతులు త్రవ్వుకుని విద్యుచ్ఛక్తి సహాయంతో అధికంగా

ఆహారధాన్యాలు ఉత్పత్తిచేస్తారు. కృష్ణాజిల్లాలో నూజివీడు తాలూకా ముసునూరు గోపవరం మొదలైన నాలుగు గ్రామాల కూడలిలో కనీసం 400 బావులు యిదివరకే ఏర్పడియున్నవి. అటువంటి గ్రామాలకు ప్రధానముగా యివ్వాలి. ఆంధ్రరాష్ట్రంలోని 11 జిల్లాలకూ ఒకేసారి supply చేయడానికి అవకాశంలేకపోవచ్చు. Upland తాలూకాలలో తిరువూరు, నూజివీడు, నందిగామవంటి ప్రదేశాలకు ఇవ్వాలని కోరుతున్నాను. Delta ప్రదేశాలలోకూడా electricity చాలా అవసరం కనుక అవసరమైతే ఋణంతీసుకుని ఈ electricity చురుకుగా గ్రామాదులకు వ్యాప్తి చేస్తారని కోరుతున్నాను.

SRI Y AUDINARAYANA REDDI:—అధ్యక్షా, ఈElectricity Demand ను బలపరుస్తున్నాను. రాయలసీమజిల్లాలు వెనుకబడిన ప్రాంతాలని చెప్పుకోవడం రివాజు. కాని రాయలసీమలోకూడా కరువుప్రాంతం అని ఒక belt area ఉన్నది. వాయిల్పాడు, మదనపల్లి, కదిరి, రాయచోటితాలూకాలు కొంతకాలంక్రితం వచ్చిన కరువులో చాలా ఘోరమైన ప్రమాదానికి గురి ఐనవి. ఈ నాలుగు తాలూకాలలో త్రాగడానికి నీరుకూడా లేని పరిస్థితులు ఏర్పడి, ప్రజలు చాలా కష్టపడినారు. Military Lorry లతో ప్రజలకు నీళ్లు సప్లయిచేసి ఆరెండు మూడు సంవత్సరాలూ ప్రజలను నీళ్లకరువునుంచి కాపాడినారు. ఆ ప్రాంతాలలో పెద్ద పెద్ద project లు కట్టుటకు నీటివనరులు లేవు. ఈ నాలుగు తాలూకాలలో ఒక్కొక్కచోట పదివేలబావులు ఉన్నవి. ఆ బావులనుంచి నీరుతోడాలంటే చాలా కష్టం. అక్కడ మంత్రిగారు electricity supply చేయిస్తే రైతాంగానికి చాలా మేలుచేసినవారవుతారు. వాయిల్పాడులో electricity ఇచ్చారు. మదనపల్లిలో, కదిరిలోకూడా ఇచ్చారు. రాయచోటిప్రక్కనున్న కడపతాలూకాలో కూడా electricity ఇచ్చారు. కాని రాయచోటితాలూకాలో ఇంతవరకూ ఇవ్వలేదు మంత్రిగారు నా ప్రశ్నకు సమాధానంచెబుతూ తొందరలో వేస్తామన్నారు; ఒక్క town కి మాత్రం ఇచ్చి తృప్తిపడితే లాభం ఉండదు. గ్రామాలకుకూడా ఇవ్వాలని కోరుతున్నాను. కొంతమంది మిత్రులు మాట్లాడుతూ Electricity Department లో డబ్బు చాలా దుర్వినియోగం అవుతోందని, ఖర్చుపెట్టినదానికి సరియైన ప్రతిఫలం రావడం లేదన్నారు. నేను ఒక చిన్న విషయం మంత్రిగారిదృష్టికి తీసుకురాదలచాను. రాయచోటిలో Electricity Department బిల్డింగులు కట్టేందుకు ఒకప్రదేశం, Power House కు ఒకప్రదేశం కొనాలని ప్రయత్నంచేస్తున్నారు. బహుశః కొన్నారేమో. మొదట ఒకప్రదేశం

8

Sri Y. Audinarayana Reddi] [27th March 1956

చూచి ఆ ప్రదేశం తక్కువధరకు వచ్చేపరిస్థితులు ఉన్నాకూడా అది తీసుకోకుండా ఇంకో ప్రదేశం తీసుకునే ప్రయత్నంచేస్తున్నారు ఒక ఎకరాకు వెయ్యి, పదహైదు నూర్లో పెట్టి అపాలం కొనవలసిన అవసరంలేదు తక్కువధరకు వచ్చే ప్రదేశాలున్నాయి. ఈ విషయం విచారించి, అనవసరంగా డబ్బు ఖర్చుచేసే ప్రయత్నం నుంచి ఉద్యోగస్థులను విరమింపచేస్తారని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

రాయచోటి తాలూకాలోని గ్రామాలకు ఎంతతొందరగా electricity ఇస్తే అంతమేలు చేసినవారు అవుతారు. ప్రతిగ్రామానికి 100 బావులున్నాయి. Electricity ఇస్తేనే కరువుబాధనుంచి తప్పించుకునే అవకాశం వుంటుంది. ఆ అవకాశం కల్పిస్తారని మంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను.

SRI A. BAPINEEDU —అధ్యక్షా, విద్యుచ్ఛక్తి సరఫరా శాఖ విషయంలో కొన్ని విషయాలు A. C. సుబ్బారెడ్డిగారు సూచించారు. అందులో జరుగుతుండే waste ను గురించి చాలా రోజులనుంచి మొరపెట్టుకుంటున్నాము. కాని ఏమీ జరిగినట్లులేదు. P. W. D. లోను Electricity లోను minor irrigation లోను waste ఎక్కువగా జరుగుతోందనడానికి సందేహంలేదు. ఎలా అరికట్టాలనే విషయంగురించి 200 సంవత్సరాలనుంచి వస్తున్న క్రమశిక్షణే ఇప్పుడూ అమలులోఉంది. కొబట్టి ఏమీ చేయడానికి వీలులేదనే అభిప్రాయాన్ని ప్రభుత్వంవారు వెల్లడి చేస్తున్నారు. Private contracts విషయమై కూడా మనవిచేస్తున్నాము స్తంభంపాతడానికి రు. 75 లు తీసుకుంటున్నారు స్తంభం పాతడానికి ఎంత అవుతుందో చూస్తే తెలుస్తుంది, దీనికి Department చేసే దానికి తేడా చూస్తే తెలుస్తుంది Contracts ఇచ్చిన works కూడా 3, 4 సంవత్సరాలు అలా పడిఉన్నాయి. Private contracts ఎక్కువ చేయడం లేదు Electricity Department లో Promotions విషయాలలో చాలా grievances ఉన్నాయని చెప్పడానికి సందేహంలేదు. విద్యుచ్ఛక్తి మంత్రిగారి notice లోనికి తెచ్చాము కులతత్వాలు బాగా జీర్ణించిపోయి 10 సంవత్సరాలవరకు ఒకే కులాన్ని అధికారంలోనికి తీసుకురావడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయని వింటున్నాము. దానిని సరిగ్గా ఆలోచిస్తారని నమ్ముతున్నాను. Electricity supply అనే విషయంలో పదేపదే సంవత్సరంనుంచి చెబుతున్నాము. గ్రామాలలో electricity supply చేసేటప్పుడు industrial purposes కు అయితే తప్ప, పంకాలు పెట్టుకోనడానికి lights కు తప్ప ఉపయోగం ఉండదు. మనం ఇచ్చే electricity కి agricultural

purposes కి అయితే బాగుంటుందిఅని గమనించవలసియున్నది. పల్లపు తాలూకాలలో ఇచ్చే electricity కేవలం పంకా లకు lights కు తప్ప వేరుగా ఉపయోగించరు మెట్ట తాలూకాల్లో అయితే వ్యవసాయానికి ఉపయోగిస్తుంది ఎవరికయితే బాగా పలుకుబడి ఉంటుందో వారి ప్రాంతాలకే విద్యుచ్ఛక్తి పోతోంది తప్ప మెట్ట ప్రాంతాలకు వెళ్లడంలేదు. దీనిని మంత్రిగారు గమనించి నూతులు ఎక్కువగా ఉన్నచోట్ల electricity ఇస్తే బాగుంటుందిఅని మనవి చేస్తున్నాను. Pumping schemes గురించి పదే పదే చెబుతున్నాము. Electricity విషయంలో Polavaram నుంచి కొవ్వూరు ఒక స్కీము ఉన్నది, 24 మైళ్లు. గుంటూల పంపింగు స్కీము అమలుచేస్తే ఏ గ్రామానికి అయినా pumping scheme సులువుగా జరుపుకోవచ్చును గ్రామాలు వారి స్వశక్తిమీద societies క్రింద form అయి చేసుకోడానికి వీలున్నది. కొవ్వూరునుంచి పోలవరంవరకు 24 మైళ్లు విద్యుచ్ఛక్తి supply చేస్తే-దారిలో చాలా ఫలవంతమయిన గ్రామాలున్నాయి; 30,40 గ్రామాలలో ఎకరానికి 25,30 బస్తాలు అవడమే కాకుండా మిర్చి, అరటితోటలు ఆవడానికికూడా వీలుఉంటుంది. వారు ఈ స్కీమును వెంటనే అమలుచేసి రైతులకు సౌకర్యం కలుగచేస్తారని మనవి చేస్తున్నాను. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఈ స్కీము ఉన్నా లేకపోయినా special గా చేర్చి ఈ 24 మైళ్లు ఇస్తే బాగుంటుందని ప్రభుత్వానికి చాలా ఆదాయం రావడానికి వీలుఉంటుందని మనవి చేస్తున్నాను. గోదావరినది మా ప్రక్కనఉన్నా మాకు ఏమీ ఉపయోగం లేకుండా ఉంది. దగ్గరఉంటే విద్యుచ్ఛక్తినయినా ఇస్తే చాలా సంతోషిస్తాము. మే నెలలో పుష్కరం వస్తోంది. కొవ్వూరుకు మే నెలకయినా electricity ప్రత్యేకించి supply చేయిస్తే సంతోషిస్తాము.

SRI C. SUBBARAYUDU :—అధ్యక్షా, ఈ డిమాండును బలపరుస్తూ కొన్ని విషయాలు నేను ప్రభుత్వ దృష్టికి తేదలుచుకున్నాను. మన రాష్ట్రం electricity ఉత్పత్తిలో వెనుకబడి ఉందని చెప్పక తప్పదు Composite State లో ఉన్నప్పుడుకూడా ఇక్కడ ఏ కారణం చేతనయితే నేమి develop కాలేదు. ఇప్పుడు develop చేసేవాటిలో తుంగభద్ర power కాని మాచ్ఖండ్ power కాని ఎక్కువ అభివృద్ధికి అవకాశాలు కల్పించేవిగా ఉన్నాయి. ఈనాటికి తుంగభద్ర power అంత లేదంటే, వారిముందున్న ప్రభుత్వంవారి, planning లోపముని ఒప్పుకోక

Sri C. Subbarayudu] [27th March 1956

తప్పదు. ఏ ప్రాజెక్టునయినా కట్టడానికి ప్రారంభించినపుడు విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి plans వేసినప్పుడు కనీసం reservoir లోని నీరు, power development కు అయినా level కు వచ్చినప్పుడు తూములు పెట్టినప్పుడు ప్రప్రథమంగా ఉత్పత్తిని ఉపయోగించడానికి plans వేయవలసియున్నది. ఆ విధంగా plans వేసిఉంటే తుంగభద్రా power ఈనాటికి వచ్చిఉండేది. Dam site దగ్గర కాకపోయినా second stage లో అయినా 110 feet fall ఉపయోగించుకున్నా కొరత తీరేది. నందికొండ, తుంగభద్ర ఎగువ కాలువ-నీటికి 250 feet fall ఉంది. ఇప్పటినుంచే detailed investigations చేసి దానికి కావలసిన turbines మొదలయినవి - తుంగభద్ర dam దగ్గర కొన్ని చేస్తున్నా అవసరిగా అందకపోతే foreign నుంచి order ఇచ్చి తెప్పించుకొనడానికి అయినా 5 సంవత్సరాల లోపుగా excavation చేసేట్లు Central Government ను ఒప్పించి పెన్నలో పడేట్లు develop చేయడానికి అవకాశాలు కల్పిస్తే మనకు కొరత తీరుతుంది. అదనంగా పెట్టుబడికి కాని కేవలం పెద్ద machineries కు కాని అవకాశాలు కలుగుతాయి. Electricity ఉపయోగంలో వ్యవసాయానికి ప్రాముఖ్యత ఇస్తుంటె డబ్బు కొరతవల్ల ఎక్కువ అవకాశాలు లేకుండా పోతున్నాయి. అభివృద్ధి కావాలంటే శక్తి ఉన్నవారికే అవకాశం కలుగుతోంది. శక్తిలేనివారికి అవకాశం కలగడంలేదు. జనాభా తక్కువ ఉన్న ప్రాంతాలలో ఎక్కువ length అవుతుంది. ఆర్థిక పరిస్థితులవల్ల industries develop చేయడానికి అవకాశంలేని కారణంచేత రావలసిన percentage రావడానికి అవకాశం లేకుండాపోతోంది.

ఇప్పుడు కాకున్నా 10 సంవత్సరాలకైనా మోక్షము కలుగుతుందనుకో లేకుండా ఉన్నవి. అందువల్ల వీలు ఉన్నంతవరకు 10% return అని పెట్టుకొన్నా నిబంధనలు ప్రత్యేక పరిస్థితులలో మినహాయింపు చెయ్యడానికి అవకాశము వుంటేనే తప్ప, ప్రభుత్వం ఏవిధముగానైనా ఏర్పాటుచేస్తేనే తప్ప, కొన్ని ప్రాంతాలకు ఏనాటికీకూడా ఎలక్ట్రిసిటీవల్ల సదుపాయము లేకుండాపోతుంది. ప్రభుత్వం ఈ విషయం ఆలోచించవలసి ఉంటుంది రాష్ట్రం మొత్తం చూస్తే బావుల సంఖ్యలో చిత్తూరు జిల్లా వస్తుంది. రెండవది అనంతపురం. చిత్తూరులో 69000, అనంతపురంలో 58,000. ఏటిలో పాడుపడినవి ఉపయోగములేనివి జిల్లాకు 5,000 బావులు ఉంటవి. మూడవ స్థానం కడప-32,000. విశాఖపట్టణంలో 16,000 బావులు ఉన్నవి. ఇన్ని బావులు ఉన్నప్పుడు, ఇతర మార్గాలు లేనప్పుడు నిజముగా

వ్యవసాయదారులను బాగుపరచవలెను అంటే ఎలక్ట్రిసిటీ పంపకములో సదుపాయములు కల్పించడానికి ఒక నిర్ణీతమైన policy ఉండవలెను. ఎంత ఎక్కడ return వస్తే అంత అక్కడ ఇవ్వడము పద్ధతి అవలంబిస్తే ఈ ప్రాంతం రైతులకు ఎక్కువ అవకాశములు ఉండవు. కొన్ని ప్రాంతాలలో వర్షాపాతం తక్కువగా ఉంటుంది. దౌర్భాగ్యానికి తోడులోతు భావులు, వాటిలో clorine ఎక్కువగా ఉండడముచేత పశువులకు వాయు నొప్పులు వచ్చి రైతులకు చాలా కష్టము కలుగుతున్నది. మా తాలూకాలో పలుప్రాంతాలలో జత 1500, 1200 రూపాయలకు 3, 4సంవత్సరాలు కూడా జతఎద్దులు రావడములేదు కనుక ఇటువంటి పరిస్థితులలో ప్రభుత్వం నిజముగా ఈ return అనేది పెట్టకుండా ఎలక్ట్రిసిటీ ఏర్పాటు చెయ్యవలెను. 4, 5 సంవత్సరాలుఅయినా, detailed investigation జరిగినా ఈనాటికి శాంక్షను అయ్యే భాగ్యం కలగలేదు. తాడిపత్రిలో చూస్తున్నాము. గాని గ్రామాలకు వ్యవసాయానికైనా ఎలక్ట్రిసిటీ ఇవ్వడంలేదు. 11%return అయినారాదనో, మద్రాసు ప్రభుత్వం డబ్బులేదనే కారణంచేతనో ఇటువంటివి మూడు నాలుగు స్కీములు శాంక్షను కాకుండా ఉన్నవి. వీటిని గురించిప్రభుత్వం ఈ 10% return మినహాయింపు చేసి, స్కీములకు priority ఇచ్చి స్కీములు శాంక్షను చేస్తేనేగాని మార్గములేదు.

మునిసిపాలిటీలలోను, మేజరు పంచాయితీలలోను industrial purposesకు licence పద్ధతివల్ల చాలా ఇబ్బందులు పడుతూఉన్నారు. మునిసిపలు కౌన్సిలు, పంచాయితీ బోర్డు రిజల్యూషను ప్యాసుచేసినా, శాంక్షనుచేసినా, స్థానిక రాజకీయాల కారణముగా చాలా ఇబ్బందులు కలుగుతున్నవి. Licence కు, electricity supply ముడిపెట్టడం ఎందుకో నాకు అర్థం కావడంలేదు. వారి ఖర్చుతో 10 H.P. పెట్టుకున్న వారికి licence ఇస్తే తప్ప Electricity ఇవ్వడములేదు. ఒకరొకరు 6, 7 మాసాలు, సంవత్సరంకూడా ఒక Saw Mill గురించి బాధలు పడుతున్నారు. మ్యునిసిపలు కౌన్సిలు resolution ప్యాసుచేసినా, Health Officer recommend చేసినా, Industrial area అయినా, వ్యక్తిగత కారణాలవల్ల స్థానిక కక్షలవల్ల ఈ విధముగా ఆలస్యము చేస్తున్నారు. Licence ఇచ్చేవరకు కరెంటు ఇవ్వకపోతే చాలా నష్టం పొందవలసి వస్తుంది. ఇప్పుడు electricity కి demand create చెయ్యడానికి వీలులేకుండా అగుచున్నది. కనుక rice mills, flour mills పెట్టడం మానుకుంటున్నారు. కాబట్టి licence కు ఎలక్ట్రిసిటీ శాంక్షనుకు ముడిపెట్టకూడదు. డబ్బు ఖర్చు పెట్టిన తరువాత licence ఇవ్వకపోతే disconnect చేస్తే చాలా నష్టం వస్తుంది. దీనిని గురించి ప్రభుత్వం

Sri C. Subbarayudu] [27th March 1956

చర్య తీసుకొనవలెనని మనవి చేస్తున్నాను. Minor Panchayat లో 2, 3 వీధులకు lighting వేస్తారు. కొన్నింటికి వెయ్యరు. డబ్బుఉన్నవారి వీధులకు వేస్తున్నారు. పేదవారు, హరిజనులు, కూలివారు ఉండే ప్రాంతాలకు దీపాలు వెయ్యకపోవడము జరుగుచున్నది. రాజకీయ పార్టీలు దానిని ఎక్కువగా ఉపయోగించుకొంటున్నారు. ఈ విధముగా కల్లూరులో జరిగింది. ఏటికి అవతల ఇచ్చి రైల్వే క్వార్టర్సు దగ్గర వీధి లైట్లు అయినా ఇవ్వలేదు. ఫ్యాక్టరీలకుకూడా ఇవ్వలేదు. ముందు గుండు గ్రామంకు ఇవ్వడము జరిగింది. అటువంటిది జరుగకుండా, పంచాయితీబోర్డులో ఊరు మొత్తముపైన return రానీయండి రాకపోనీయండి lighting వెయ్యవలెను. Return వచ్చినాసరే రాకపోయినాసరే మినహాయింపులు చెయ్యవలెను అని మనవి చేస్తున్నాను నాకు ఈ అవకాశము ఇచ్చినందులకు అధ్యక్షులవారిని అభినందిస్తున్నాను

MR. SPEAKER.—I am very sorry to remark that several hon. Members are reading newspapers in the House. So much so, the House looks as if it is a reading room. So, I have to bring to the notice of the hon. Members that reading newspapers in the House is strictly forbidden. We shall observe it hereafter.

Sri SHEIK MOULA SAHEB :—అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశ పెట్టిన Electricity Demand ను బలపరుస్తూ వారిని అభినందిస్తున్నాను. అయితే వారికి ఒక సలహా అందచెయ్యవలసిన అవసరం ఉంది. ఎలక్ట్రిసిటీ అభివృద్ధి నిజముగా వ్యవసాయానికి, పరిశ్రమలకు ఉపయోగించేదేనా, లేకపోతే పట్టణవాసాలలో, పెద్ద గ్రామాలలో దీపాలకు మాత్రమే ఉపయోగపడుతుందా అనేది చూడవలసిఉన్నది. పరదేశపు సినీమాలు, ఫిల్ములు చూసినపుడు ఆ దేశాల అభివృద్ధి తెలుస్తున్నది. మనము చేస్తున్న కృషి నిజముగా దరిద్రాన్ని, నిరుద్యోగ సమస్యను నిర్మూలించడానికి, పరిశ్రమలకు, వ్యవసాయానికి ఎంత ఉపయోగపడుతున్నదిన్నీ, మంత్రిగారు తన దృష్టికి తీసుకొనగలరు. ఆ విషయం వారు తెలుసుకోవాలని కోరుచున్నాను.

ఇప్పుడు రెండవ ప్లానులో ఎలక్ట్రిసిటీ అంకెలు సంతృప్తికరముగా ఉన్నవి. కాని అవి దీపాలకోసం ఉపయోగపడకుండా చూడవలెనని మాత్రము కాదు అన్నింటికి ఉపయోగించవలెనని నేను కోరుచున్నాను.

27th March 1956] [Sri Sheik Moula Saheb

నిజముగా ఆంధ్ర రాష్ట్రములో రాయలసీమలో అయితే నేమి, ఏజన్సీ ప్రాంతంలోనైతే నేమి, ఇంకను వెనుకబడిన ప్రాంతాలు అనేకము ఉన్నవి. మా నెల్లూరు జిల్లాలో రెండు తాలూకాలు మాత్రము అభివృద్ధి చెందినవి. అవి డెల్టా తాలూకాలు. మా జిల్లా శాసన సభ్యులు చాలా గొప్పవారు. అందులో ప్రధాన మంత్రిగారు ఒకరు. రెండవ వారు కోదండరామ రెడ్డిగారు ఆయన జమీందారు గారు. తరువాత మూడవవారు A. C. సుబ్బారెడ్డిగారు. వీరు కూడా పెద్ద వారే. వారికి ఈ మెట్ట తాలూకాల విషయము అంతగా అక్కరలేదు. ఈ కష్టాలను గురించి నేను చెప్పవలసి వస్తున్నది.

ఉదయగిరి తాలూకా చాలా వెనుకబడిఉన్నది. ఈ తాలూకాలో electricity వ్యవసాయానికుపయోగపడేటట్లు, పరిశ్రమలకుపయోగపడేటట్లు చేయవలసినదని Planning మంత్రిగారికి యీ ఆంధ్రరాష్ట్ర శాసనసభ వీర్పడి నప్పుడు 22—4—55 తేదీని అందజేసిన నివేదికలో తెలిపాము. Chief Engineer గారు ఒకమాసం జరిగిన తరువాత ఆత్మకూరు, వింజమూరు, ఉదయగిరికి electricity నిర్మించడానికి ఆమోదించి estimate తయారు చేసి ప్రభుత్వ ఆమోదంకొరకు పంపి. ఉన్నాం. త్వరలో ఆమోదం అయిన తరువాత electricity నిర్మిస్తాం అని endorsement యిచ్చినారు. Government Secretary కూడా అరకంగాయిచ్చారు. ఈ 10 మాసాలు అది ఏమయినదో తెలియదు. మొత్తంమీద వ్యవసాయానికి పరిశ్రమకు ఉపయోగపడే చోట యిస్తే బాగుంటుంది. పట్నవాసాలలో పెద్దఊర్లలో దీపాలు వెలిగించడానికే యీడబ్బు వినియోగపడుతున్నది రెండోది గ్రామాలలో పూరిగుడిశలలో, కిర్సనాయిల్ బుడ్లు పెట్టుకోవడంవల్ల ఎక్కువ అగ్నిప్రమాదాలవుతున్నాయి. దానిని నివారించడానికి electricity గ్రామాలలో సరఫరాచేస్తే కొంత ఉపకరిస్తుంది. కాబట్టి యిటువంటివాటిని దృష్టిలో పెట్టుకుని పరదేశీఫెల్ములు ఒకసారి చూచి నేర్చుకోమని మనవిచేస్తూ యీ Demand ను బలపరుస్తూ విరమిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS:-అధ్యక్షా, ఈElectricity Demandను బలపరుస్తూ కొన్ని సూచనలు మాత్రం చేస్తున్నాను. ముఖ్యంగా electricity విషయంలో ఆంధ్రరాష్ట్రంలో చాలామట్టుకు మనం అభివృద్ధిపొందినా దేశంయొక్క పరిస్థితిఅంతా చూచుకుంటే మనం చాలా వెనుకబడి ఉన్నాం. అందుచేత యింకా మనం ముందుకుపోవడానికి ప్రయత్నం చేయాలనే నేను కోరుతున్నాను. అయితే ద్యా electricity విషయంలో నేను ఒకవిషయంలో మాత్రం విచారిస్తు

Sri L. Lakshmana Das] [27th March 1956

న్నాను. మరి ఎంతో వెనుకబడివున్న శ్రీకాకుళం జిల్లాలో పట్టణాలు ఏమాత్రం లేకుండా 2 లక్షలు జనాభా కలిగిన పాతపట్నం తాలూకాలో యింతవరకు electricity దీపాలంటే ఏమో తెలియని పరిస్థితిలో మేమున్నందుకుమాత్రం విచారిస్తున్నాను. మొదటి పంచవర్ష ప్రణాళిక ఆఖరయ్యేసరికి ప్రతి తాలూకా headquarters కు current యిస్తాం అని ప్రకటనలుచేస్తే మేముకూడా ఆప్రకటనవల్ల తప్పకుండా వస్తుందని చాలా ఆశించాము. కాని యిప్పుడు మొదటిపంచవర్ష ప్రణాళిక పూర్తవుతుంది. మరి యిప్పటికైనా electricity మా పాతపట్నం తాలూకాలోకి వస్తుందని ఆశిస్తున్నాను. ముఖ్యంగా పాతపట్నం తాలూకా కేవలం వ్యవసాయంమీద ఆధారపడి ఉండడమే కాకుండా రెండు ప్రధానమైన నదులు-వంశధార ఒకనది 25 మైళ్లు, యింకోనది 30 మైళ్లు తాలూకా మధ్యభాగంలో ప్రవహించినా వాటిని ఉపయోగించడానికి current యిస్తే బాగుంటుంది. అందుచేత దానికి ప్రత్యేకమైన శ్రద్ధవహించి అక్కడ వ్యవసాయదారులుఉపయోగించుకుని దేశానికి హెచ్చుపంటలు పండించే అవకాశం కలుగుతుందని మనవిచేస్తున్నాను. తరువాత రెండవపంచవర్ష ప్రణాళిక ఆఖరులోనే వంశధారపై సింగిడిదగ్గర ఒక barrage కడతారని చెప్పిschemeలో ఉన్నది. అందుచేత వెంటనే ఈసింగిడిదగ్గర barrage కట్టకముందే దానికి electricity అవసరంఉంటుంది. కాబట్టి యిప్పుడు ఆ ప్రాంతానికి current తీసుకుపోతే అభివృద్ధిచెందడమే కాకుండా వంశధార నీటితో వ్యవసాయం అభివృద్ధిచేసుకోవడానికి అవకాశంఉన్నదని మనవిచేస్తున్నాను. అందుచేత ప్రత్యేకంగా మనవిచేసేది ఏమిటంటే పాతపట్నం తాలూకాలో మీరు శ్రద్ధవహించవలసినదని, ముఖ్యంగా పాతపట్నం headquarters కిమారమి 19, 18 మైళ్లు టెక్కలికి నడుమ current వస్తుంది. అక్కడనుంచి railway siding నుంచి current తీసుకు రావలసినదని కోరాము. దానికి యిప్పుడు ఆమోదిస్తారని ఆశిస్తున్నాను. తరువాత వ్యవసాయదారులకుయిచ్చే current విషయంలో 0-1-3 చొప్పున వసూలుచేస్తున్నారు. అదిలేకుండా 0-1-0 చొ500 Unitల వరకుచేస్తే కొంత ఉపయోగకరంగా ప్రోత్సాహకరంగా ఉంటుందని ఆశిస్తున్నాను. తరువాత ముఖ్యంగా A. C సుబ్బారెడ్డి గారు ఆ డబ్బు విషయంలో Electricity department లో చాలా దుబారా ఖర్చులవుతున్నాయని చెప్పారు. ఆ విషయాలుకూడా ప్రత్యేకంగాపైన వింటున్న విషయాలనుబట్టి కొంత దుబారా జరుగుతున్నదనే తెలుస్తున్నది. అందుచేత యీ విషయంలో మంత్రిగారికి మనవిచేసేది ఏమిటంటే యిప్పుడు మనం ఉత్సాహంతో హెచ్చుకోట్లు ధనం ఖర్చుపెట్టి పైనుంచి సామాన్లు తెచ్చుకుంటున్నప్పుడు tenders విషయంలో అయితేనేమి, యితర విషయాలలోనైతేనేమి, ప్రభుత్వం క్రింద Official

Committee ని ఏర్పరచింది. కాని Official Committee కి కొంతమంది non-officials ను కూడా కలిపితే కొంతవరకు దాంట్లో ఉన్న విషయాలు బయటికి తెలుస్తాయి. జాగ్రత్తగా రావడానికి అవకాశం ఉన్నది. అందుచేత నేను ముఖ్యంగా Tenders విషయంలో callfor చేసినప్పుడు యీ Official Committee తో సహా non-officials ను ఒకటిద్దరిని వేసి ఎవరెవరికి tenders యివ్వాలో నిర్ణయంచేస్తే బాగుంటుందని కోరుతున్నాను. అదేవిధంగా రాష్ట్రం మొత్తంపైన 5 Central stores ఉన్నాయి. ఆ Stores లో అనేకమైన లక్షలకోట్లు విలువగలసామాన్లు అక్కడుండడం జరుగుతుంది. మరిప్పుడు A. C. సుబ్బారెడ్డిగారు ఏదో చెప్పారు, విశాఖపట్నంలో ఏదో జరిగిందని. ఇటువంటి అపోహాలకు తావులేకుండా ఒకయాజమాన్యాన తనిఖీచేసే విధంగా చూచుకుంటే యిటువంటివి చాలా తగ్గుతాయని విశ్వసిస్తున్నాను. ఈ విషయంలో ప్రత్యేకమైనశ్రద్ధ తీసుకోవాలని నేను ఆశిస్తున్నాను. తరువాత ముఖ్యంగా యీ current supply చేయడం విషయంలో మౌలానా సాహెబ్ గారు చెప్పినట్టుగా రైతులకు దినానికొక గ్రామానికిస్తాం అని ప్రభుత్వం చెబుతున్నది దినానికి ఒకగ్రామం అనిచెప్పడం బయటకు బాగానే వున్నదికాని మన రాష్ట్రంలో ఆ విధంగా చూచుకుంటే ఎన్నో సంవత్సరాలు పడుతుంది. అదేకాకుండా హెచ్చుగ్రామాలకు supply చేయడమే కాకుండా వ్యవసాయానికి ఎంతవరకు supply చేస్తున్నాం? వ్యవసాయ అభివృద్ధికి ఎంతవరకు ఉపయోగపడుతున్నది? చూడాలిఅందుకు కోటాపెంచి ఖర్చుపెట్టడం లేదనిగాని, ప్రభుత్వం ప్రత్యేకమైన శ్రద్ధతీసుకోవడంలేదని చెప్పడంలేదు. అది జాగ్రత్తగా పరిశీలిస్తే తేలుతుంది. సందేహంలేదు. ఈ 2½ సంవత్సరాలు Electricity విషయంలో ఎంతో వెనుకబడివున్న మనం చాలా ముందుకు పోవలసి వున్నది. దానినిగురించి Central Government లో పరిస్థితులను తెలియచేస్తే ఉత్పత్తిఅవుతున్న Electricity ఉపయోగించే విధంగా Central Government ను అర్థించి కొంతయినా తీసుకువచ్చి ఖర్చుపెట్టడంకూడా అవసరమే. కాని ఖర్చుపెట్టేటప్పుడు వ్యవసాయదారుల కుపయోగపడే project లు వెంటనే ప్రారంభించి నీటివాగులు నూతులు, యిటువంటివిఉన్న ప్రదేశాలకు యీ current ను ఉపయోగిస్తే రైతాంగం అభివృద్ధిపొందడానికి చాలా అవకాశంవుంటుంది. అందుచేత రైతుల కుపయోగపడేటట్లు current యివ్వడానికి కేటాయింపు చేయాలని వెనుకబడిన ప్రాంతాల విషయంలో ప్రత్యేక శ్రద్ధవహించాలని కోరుతున్నాను. అదికాక పెద్ద పెద్ద

Sri L. Lakshmana Das] [27th March 1956

బస్తీలలో Industrial areas లో యింకా అభివృద్ధికరంగా current హెచ్చుగా వున్నది. రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాలలో Electricity వేస్తే బావులనుంచి నీరుతీసుకోడమో చిన్న చిన్న పరిశ్రమల కుపయోగించేటట్టుగా చేసే ప్రయత్నం జరుగవలసిన ప్రాంతాలకు వెళ్ళడంలేదు. ఎందుకంటే అక్కడ Industrialists లేరు. Industrialists ఉంటే ఫలానా చోట రావాలని ప్రయత్నంచేసేవారు. వెనుకబడ్డ ప్రాంతాలవిషయంలో remunerations అనేది మరచిపోవాలి ప్రభుత్వం ఖర్చు పెడుతున్న దానికి తిరిగి డబ్బు రాబట్టుకోడం అవసరమే. మనం ఎన్నో కోట్లు ఖర్చు పెడుతున్న దానికి వడ్డీరూపంగానయినా రావాలి. వచ్చితీరుతుంది. Remuneration విషయంలో ప్రతి restriction పెట్టుకుంటే ప్రస్తుతం రాకపోవచ్చు. అదృష్టవశాత్తు ఆంధ్రదేశంలో Electricity ఉత్పత్తికేంద్రాలు చాలావున్నాయి. మనరాష్ట్రంలో కావలసిన Electricity మనరాష్ట్రంలోనే ఉత్పత్తిచేసుకునే అవకాశంవున్నది. ప్రతిగ్రామానికి ప్రతియింటికి supply చేసుకోవలసిన పరిస్థితి వున్నది. అందుచేత దీనివల్ల నష్టంవస్తుందనికాని ఉపయోగించినడబ్బు రావనిగాని అటువంటి అనుమానం పెట్టుకోనవలసిన అవసరంలేదు. ఆంధ్రలో 10 ఏండ్లతరువాత ప్రభుత్వం Electricity Department లాభదాయకంగావుండి ప్రభుత్వంయొక్క ఆదాయం అభివృద్ధి అవుతుందని సంపూర్ణమైన విశ్వాసం నాకున్నది. ఇలాంటి పరిస్థితులలో remuneration అనే ఆలోచన లేకుండా వీలయినంతవరకు వ్యవసాయం అభివృద్ధిచేస్తే ప్రస్తుతం నష్టంగావున్నా. ముందు ముందు చాలా బాగుంటుందని ఆ విషయంలో ప్రత్యేకంగా శ్రద్ధవహించాలి. తరువాత ఆ tenders విషయంలో యీ Central Stores విషయంలో ప్రత్యేకమైనశాఖలో officials తో non-officials ను కూడా వేయాలని కోరుతూ నేను యీ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షులకు వందనాలు అర్పిస్తున్నాను.

Sri P. KODANDARAMAYYA :—అధ్యక్షా, అంగట్లో అన్నీ ఉన్నాయి కాని అల్లుడినోట్లోమాత్రము శని ఉన్నది. ఈ దేశంలో ప్రతి తాలూకాలోనూ విద్యుచ్ఛక్తి ఉపయోగిస్తున్నారు మా ఏజన్సీప్రాంతాలలో మాత్రం విద్యుచ్ఛక్తి అంటే ఎలాగుంటుందోకూడా తెలియనిస్థితిలో ఉన్నారు. ఈ విద్యుచ్ఛక్తి మా ఏజన్సీప్రాంతము అయిన మాచ్ ఖండ్‌లోనే పుడుతుంది. అక్కడే వర్షాలుకురిసి నదులు ప్రవహిస్తాయి. కాని వీటివల్ల ఆ ప్రాంతాలవారికి ఏమీ ఉపయోగములేదు. విద్యుచ్ఛక్తిశాఖా మంత్రిగారు colonization scheme లో పెట్టుతాము అంటున్నారు కాబట్టి, వెంటనే అక్కడైనా పెట్టి, వారికి విద్యుచ్ఛక్తి

ఎట్లాయుంటుందో తెలుపుతారని ఆశిస్తున్నాను. రాష్ట్రప్రభుత్వమువారు దానికొఱకు డబ్బు ఖర్చుపెట్టుకోనవసరములేదు. కేంద్రప్రభుత్వమువారు డబ్బు ఇస్తారు ఆప్రాంత ప్రజలు ఈ విద్యుచ్ఛక్తితో వాగులలోనుంచి నీరుతోడుకొని, వ్యవసాయము చేసుకొనుటకుకూడా వీలుంటుంది. అందువల్ల ఇటువంటి ఏర్పాటులు అన్నీ చేయించమని మంత్రిగారిని కోరుటకే నేను ఇక్కడ నిలబడినాను. ఆ విధంగా ఏర్పాటుచేయిస్తారని ఆశిస్తూ ఇంతటితో సెలవుతీసుకుంటున్నాను.

Sri M. RANGAYYA :—అధ్యక్షమహాశయా, ఈ Electricity Demandను నేను బలపరుస్తున్నాను. లచ్చన్నగారు ఈ శాఖను నిర్వహిస్తున్నారంటే చాలా సంతోషపడ్డాము. కాని మేము అనుకొన్నదానికంటే వారు ఎక్కువగా శ్రద్ధతీసుకున్నప్పటికి, కార్యక్రమములోకి వచ్చేప్పటికి రైతులకు ఇది తగినంత ఉపయోగపడటము లేదని చెప్పడానికి చింతిస్తున్నాను. మనం పన్నులు వేసినా అవి అన్నీ రైతులమీదే పడుతున్నాయి. రైతులే అన్నిసౌకర్యములు చేసుకుంటున్నారని మనం అనుకొంటున్నాము. రైతులు చేసుకోవడములేదు. ఆ విషయం ఈ శాసనసభలో అనేకపర్యాయములు complaints వస్తున్నాయి. అటువంటిపరిస్థితులలో రైతులకు కావలసిన సౌకర్యము అన్నీ కుదర్చవలసిన బాధ్యత ప్రప్రథమంగా మనయందున్నది. ఈ Electricity ని ముందు వైద్య, విద్యాకళాశాలలకు, చికిత్సాలయాలకు సప్లయిచేసుకున్నతరువాత దానిపైన హక్కు రైతులకు ఉండాలని మనవిచేస్తున్నాను. మెట్టప్రాంతములలో అనేకమందిరైతులు Electricity తో వ్యవసాయమును అభివృద్ధిచేసుకోవాలంటే, వారికి ఇది సప్లయిలేక బాధలుపడుతున్నారు.

ఏలూరుతాలూకాలో రాయనపాలెం, విజయపాలెంగ్రామాలలో బావులనుండి Electricity ద్వారా నీరుతోడుకోవాలంటే, మినిమమ్ కన్‌సప్షను తీసుకుంటేనే గాని Electricityని ఉపయోగించుకోవడానికి వీలులేదంటున్నారు. అందువల్ల వారు Electricity ని ఉపయోగించుకునే పరిస్థితిలో లేరు ఇవన్నీవారు నాకు 2, 3 పర్యాయములు చెప్పడము జరిగినది. అందువల్ల రైతులకు వ్యవసాయమునకు ముందు Electricity ని ఇచ్చి, తరువాత పరిశ్రమలకు ఇస్తే బాగుంటుంది. రైతులకు సప్లయిచేసేసమయములో ఎంత మినిమమూ చార్జి వేయడానికి వీలవుతుందో అంత మినిమము చార్జికి దీనిని సప్లయిచేసి, అది రిమ్యూనరేటివ్‌గా ఉన్నదా, లేదా అని ఆలోచించవలసిన అవసరము లేదని నేను మనవిచేస్తున్నాను. పట్టణాలలో భోగవిలాసాలకు Electricityని ఉపయోగిస్తున్నారు. ముందు మానవుని జీవితావసరాలకు

Sri M. Rangayya] [27th March 1956

సప్లయిచేసి, తరువాత ఈ భోగవిలాసాలకు సప్లయిచేయాలి కాని ముందు వీటికిచేయడం న్యాయముకాదు. అందువల్ల రైతులకు వ్యవసాయపనులనిమిత్తం, cost తో నిమిత్తంలేకుండా రిమ్యూనరేటివుతో నిమిత్తములేకుండా ముందు సప్లయిచేయాలని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, విద్యుచ్ఛక్తి డిమాండును నేను బలపరుస్తున్నాను. చాలామంది సభ్యులు నాతో విద్యుచ్ఛక్తి మంత్రిగారు మీ జిల్లా వారేగదా, అందువల్ల విద్యుచ్ఛక్తి అంతాకూడా మీజిల్లాలోనే ఖర్చుఅయిపోతున్నది అని అంటున్నారు. మంత్రిగారు మాజిల్లావారైనప్పటికి మధ్యసర్కారులకు, రాయలసీమకే వారు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నారు. మాజిల్లాకు ఏమీ ఇవ్వడములేదు అని అంటున్నారు.

మా పాతపట్నం తాలూకాలో ఇదివరకు ఒక్క M. L. A. ఉండేవారు. అది వెనుకబడియున్నదని ప్రభుత్వమువారు ఇద్దరు M. L A. లను ఇచ్చినారు. ఎన్నికల రోజులలో పాతపట్టణమును, కొత్తపట్టణముగా చేస్తామని హామీ ఇచ్చిఉన్నాము. మా జిల్లాలో సోంపేటనుంచి ఇచ్ఛాపురంవరకు ఒక line మాత్రము యున్నది. అక్కడ అయినా స్తంభాలుమాత్రము కన్పిస్తున్నాయిగాని, దీపాలు ఎక్కడా కన్పించడములేదు. టెక్కలినుంచి పాతపట్టణము 20 మైళ్ల దూరములో ఉన్నది. అక్కడకూడా electricity ని సప్లయిచేస్తే పాతపట్టణంవద్ద వంశధారా నదిక్రింద పంపుసెట్లుతో నీరుతోడి, కూరగాయలు వరి పండించుకోవచ్చునని చాలా ఉత్సాహంగా ఉన్నారు. అందువల్ల పాతపట్టణంకు electricity సప్లయిచేసి అక్కడి గ్రామరైతులకు తగినటువంటి electricity ని సప్లయిచేస్తారని ఆశిస్తున్నాను.

ఆదేవిధముగా టెక్కలితాలూకాలోగూడా, చాలామంది గ్రామప్రజలు electricity కావలయునని కోరుతున్నారు వారు పంపింగు సెట్లు పెట్టుకొని, మిరపతోటలు, పొగాకుతోటలు పెంచుకోవాలని చాలా ఉత్సాహంగా ఉన్నారు. అందువల్ల వారికి తక్కువరేట్లకు electricity ని సప్లయిచేయించాలని మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను. పట్టణములలో ఈ electricity ని ఎక్కువగా దీపాలకోసం ఉపయోగిస్తున్నారు.

Electricity పట్టణాలలో దీపములకొరకు ఎక్కువగా వినియోగించబడుతున్నది. ఇంక కొంతకాలం పోయేసరికి విశాఖపట్నం, విజయనగరం మున్నగుచోట్ల ట్రాములున్నగునవి నడుపుతారని, వంటచేసుకోడానికికూడా విద్యుచ్ఛక్తి వినియోగపడేట్లు చేస్తారని ప్రజలు అనుకొంటున్నారు. ముఖ్యంగా మా ప్రాంతే

మంతా forest కు సంబంధించి ఉన్నది. మంచి ఫలజాతులతోటలున్నాయి. మంచి మామిడితోటలు, ఇతర పలవృక్షము లన్నింటినిపడగొట్టి వాటిని పొయ్యిలోకి ఉపయోగిస్తున్నారు. మా పాతపట్నంలోకూడ మంచి ఫలవృక్షములున్నవి. కేగిపళ్లు మొదలైనవన్నీ పండుతాయి. వీటన్నింటిని బొగ్గులుగా మార్చి ఉపయోగించుకొంటున్నారు. మనదేశంలో కుమ్మరి, కమ్మరులకు ముఖ్యంగా బొగ్గు అవసరం. వారు మామిడితోటలను తక్కువ రేటుకు కొనుక్కొని బొగ్గులుగా చేసుకొని ఉపయోగించుకొంటున్నారు. కాబట్టి ఇదిఒక పరిశ్రమగా భావించి ఈ కుమ్మరి, కమ్మరులకు విద్యుచ్ఛక్తి ఇచ్చినట్లయితే మనకు ఫలజాతులతోటలు నిలబడతాయి. మనం ఒక మొక్కనుపెంచాలంటే 10, 15 సం॥లు పెరిగితేనేకాని అది ఫలించదు. కాబట్టి అటువంటి అరణ్యములను విరగగొట్టకుండా ఈ కుమ్మరి, కమ్మరులకు electricity supply చేసే ఏర్పాటుచేయవలసినదిగా అధ్యక్షులవారి ద్వారా మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను.

ఇప్పుడు తిండికే బాధపడుతూ దీపాలుకూడలేక బాధపడే హరిజనులున్నారు. వారికికూడా విద్యుద్దీపాలు ఏర్పాటుచేయవలసినదిగా మంత్రిగారిని కోరుతున్నాను. ఈ రెండవపంచవర్ష ప్రణాళికలో విద్యుచ్ఛక్తికోసం ఎక్కువగా కేటాయించినారు. ప్రభుత్వంవారు వారి సమాధానంలో గున్నయ్య ఇలా చెప్పారు, మౌలానా సాహెబ్ అలా చెప్పాడు అని కాకుండా ప్రతిసభ్యునియొక్క అభిప్రాయమును గమనించి తగిన సమాధానమును చెప్పవలసినదిగా అధ్యక్షులవారిద్వారా మంత్రిగారిని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri C. P. THIMMA REDDI :—అధ్యక్షా, ఈ విద్యుచ్ఛక్తి ప్రతి గ్రామములోను ముఖ్యావసరమై ఉన్నది. ఇప్పుడు మనం విద్యుచ్ఛక్తితో దీపములు పెట్టుకొంటున్నాము. మనదేశం అభివృద్ధి చెందాలంటే పాడిపంటలు ముఖ్యావసరం. పాడిపంటల వభివృద్ధి చేయాలంటే irrigation కావాలి. మనకు ఈ భూమి బాగా పండుతుంది అనే నమ్మకం రైతులలో కలిగినప్పుడు వారు ఉత్సాహంతో చేయడానికి అవకాశమంటుంది. కాని ఇప్పుడు అన్ని ప్రాంతములలోను నీటి వనరులు ఎక్కువగా లేకపోవచ్చును. కొంతవరకు భావుల అవసరం ఉన్నది. కొన్ని కొన్ని ప్రాంత్రాలలో ప్రభుత్వంవారు subsidy ఇచ్చి నీటివనరులు కల్పిస్తున్నారు. భావుల త్రవ్వడమే కాకుండా ఆనీరు పైకి వచ్చేటటువంటి విధానంకూడా ఉండాలి. ఇంతవరకు మోట విధానంవల్ల నీటిని పైకి తీసికొంటున్నారు. కొన్ని బావులలో నీరు బాగా లోతుగా ఉండడంవలన, ఈ రోజులలో రైతులు నాగరికత పెరిగే కొద్దీ కష్టపడి పని చేయలేకపోవుటవలన వ్యవసాయం దెబ్బ తింటున్నది.

Sri C. P. Thimma Reddi] [27th March 1956

బావులనుండి ఖర్చులు గిట్టుబాటయ్యేటట్లు సునాయాసంగా నీటి పారుదల చేసినట్లయితే commercial గా పెట్టుకోడానికి అవకాశాలున్నాయి. ఇప్పుడు అటువంటి అవకాశములు లేకపోవడంవలన కొంతమంది oil engines పెట్టుకొని ఎక్కువ ఖర్చులు భరిస్తూ బాధపడుతున్నారు. పల్లెలలో ఇంజనీరింగు పద్ధతిలేదు పల్లెలలోనివారు ఈ machines ను repair చేయించుకొనుటకు అవకాశములు లేకపోవుటవలన ఈ ఇంజనీరింగు పద్ధతి గ్రామాలలో ఏర్పాటు చేయడం చాలా కష్టం. వారు ఉపయోగించుకొనలేకపోతున్నారు. అందుచేత electricity ఉన్నట్లయితే ఒక motor ను తెప్పించుకొనవచ్చును. దానికి ఉపయోగించుటకు డబ్బు తక్కువగా ఖర్చవుతుంది. కాబట్టి వారికి electricity సౌకర్యములు కల్పించడమే తమ ప్రధాన కర్తవ్యంగా ప్రభుత్వంవారు అనుకోవాలి. మా ప్రాంతంలోని బావులలో నీరు పైకి ఉంటుంది. నల్లమల forest కు, కడప, కర్నూలు రోడ్డుకు మధ్య ఉన్న ప్రాంతంలో 3, 4 మెట్లుకంటె ఎక్కువ లోతు ఉండదు. కాని ఇంకా చాల బావులున్నాయి. వాటికి ఇక్కడ లైనులేదు. బనగానపల్లి, కోయలకుంట్ల మీదుగా connection ఇచ్చినారు. ఇప్పటికయినా నంద్యాలనుంచి line ఇచ్చినట్లయితే అక్కడ ఉన్నటువంటి ప్రాంతాన్ని కంతకూ కూడ నీరు లభిస్తుంది. మన దురదృష్టం కొద్దీ సిద్దేశ్వరం ప్రాజెక్టు రాకపోయి నప్పటికీ electricity ద్వారా ఆ ప్రాంతంలో ఉన్న బావులనుండి నీరువచ్చే ఏర్పాట్లు చేసినట్లయితే ఆ ప్రాంతము అభివృద్ధిలోకి రాగలదు. ఈ electricity నుపయోగించుకొని పంకాలక్రింద భోగాలు అనుభవించడంకంటే గ్రామాలలోని రైతులకు సౌకర్యములు కలుగజేస్తే బాగుంటుంది. ఈ పంకాలవలన మనకు కృత్రిమ మయినగాలి వస్తుంది. ఈ పంకాల క్రిందకంటే ఏ వేపచెట్టు క్రిందనైనా కూర్చుంటే సహజ సిద్ధమయిన చల్లగాలి లభిస్తుంది. ఆ గాలిలోనే ఆనందం, సుఖం సంతోషం ఉంది. ఈనాడు మానవుడు తన తెలివితేటలవలన, చాకచక్యం వలన ప్రపంచములో ఒక విధమయిన మార్పు తీసుకొనివచ్చి ఏదో సుఖమును పొందు తున్నా ననుకొంటున్నాడు. కాని పట్టణాలలోనివారు పల్లెలకుపోయి నాగరికత నేర్చుకోనవలసిన అవసరం ఉన్నది. కాని ఈ నాగరికతను తీసుకుపోయి పల్లెలలో ప్రదర్శించినట్లయితే బాగుండదు. నిజమైనటువంటి ఆరోగ్యం, సౌఖ్యము పల్లెల లోనే ఉన్నది. 10 వేల రూపాయలు ఖర్చు చేసినా గాని అటువంటి చల్లని గాలి, ఆనందం పట్టణములలో దొరకదు ప్రజా అవసరమైన వాటికీ, సుద్దకు కొదువలేని విధంగా electricity ని గ్రామాలలో ఉపయోగించేటట్లుచేసి ఆ గ్రామాలను అభివృద్ధిలోకి తీసుకొనివచ్చుటకు ప్రభుత్వంవారు పూనుకోవాలని మనవిచేస్తున్నాను. నానాటికి నాగరికత ప్రబలిపోతున్నది. అసలు నాగరికత అంటే ఏమిటి ?

27th March 1956]

MR. SPEAKER :—విద్యుచ్ఛక్తిని గురించి మీరు ఉపన్యాస మివ్వండి.

SRI C. P. THIMMA REDDI :—ముఖ్యంగా మా ప్రాంతములో విద్యుచ్ఛక్తి సప్లయిచేసి అభివృద్ధి పరచవలసినదిగా నేను ప్రభుత్వమును కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

THE HON. SRI G. LATCHANNA :—అధ్యక్షా! ఈ Demand మీద 25 గురు గౌరవసభ్యులు తమ తమ అభిప్రాయములను తెలియజేస్తూ, వారికి తోచినటువంటి సలహాలనిచ్చినందుకు వారందరికి నేను కృతజ్ఞతను తెలియజేస్తున్నాను. ఇప్పుడు సభ్యులు చెప్పినవాటిలో 3 ప్రధానమైన విషయములను గురించి మనం ముందుగా చర్చించవలసి ఉంటుందని నేను అనుకొంటున్నాను. ఈ Department లో ఉన్నటువంటి దుబారా ఖర్చునుగురించి, contractors కు ఇవ్వడంలో జరుగుతున్న లోపాలనుగురించి A. C. Subba Reddi గారు తెలియజేసినందులకు వారిని అభినందిస్తున్నాను. ఈ P.W.D అంటేనే దుబారాఖర్చుకు పేరుపొందినది. ఇది ఈనాడు జరుగుతున్న విషయంకాదు నేనుకాని, సుబ్బారెడ్డిగారుగాని దాని లోపములను గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు మద్రాసు రాష్ట్రంలో రాజగోపాలాచారిగారు మంత్రిగా ఉన్నప్పుడు ఈ P. W. D. ప్రపంచానికంతకు Enemy No. 1 అని అధికారరీత్యా ప్రకటించినారు.

అర్థశాస్త్రవేత్త, ప్రతిభావంతులు, అంతర్జాతీయ ప్రఖ్యాతపురుషుడు అయినటువంటి రాజగోపాలాచారిగారు Enemy No. 1 అయిన P. W. D ని సవరించలేకపోయినారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన నాటినుండి మనం పరిస్థితులను చూస్తూనే ఉన్నాము. General గా estimation గురించి రాజగోపాలాచారిగారిదగ్గర నుంచి A. C. Subba Reddi గారివరకు అందరూ బాధపడుతున్నాము. దానిని ఎట్లా సవరించడమా అనేవిషయము అనేక సమావేశములలో చర్చించబడుతున్నది.

ఒక electric pole పాతడానికిగాను 75 రూ॥లు ఖర్చుఅవుతుందిఅంటే లోకానికే ఎకసక్కెంగా కనబడుతోంది. ఇపుడు K. C. Canalకు సంబంధించినంతవరకు ఇటువంటి అపోహ ఒకటి ప్రచారంలోఉన్నది. మైలుకు 4 లక్షల రూ॥లు estimation వేసి అందులో 60 వేలు మిగిలిపోతే మేసుకొట్టుకొంటున్నారని కాఫీ hotel లోను బజార్లోను చెప్పుకుంటున్నారు. ఈ విషయంగురించి మన ప్రజలు పరీక్షచేస్తున్నారు. ఒకటి రెండు సంవత్సరాలలో నేను files లో చూచాను, Schedule rates లోనే తంత్రము, కుతంత్రము, మోసము కుట్ర

Sri G. Latchanna] [27th March 1956

పీటినిగురించి ఏదైన పునరాలోచనచేస్తే బాగుంటుంది. పునరాలోచన చేయాలి అంటే Technical experts రావాలి. ఇక్కడ ఉన్నటువంటి Chief Engineer, Superintending Engineer తయారుచేసిన estimates లో అధికమైనటువంటి దుబారా ఉన్నదని అనుకుంటే Government of India నుంచివచ్చిన Engineer లను తెప్పించవలసిఉన్నది. నాకు తెలిసినంతవరకు నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు సంబంధించినంతవరకు మాచెర్లనుండి నాగార్జునసాగర్ dam site కు రైల్వేలైను కట్టుపోయడానికి 34 లక్షల రూపాయలని estimate వేశారు. మన Chief Engineer గారే దుబారా estimates వేస్తారని ఒక మైలు సిమెంటు వేయడానికి 4 లక్షలు ఖర్చుపెడతారని మనం బాధపడుతున్నాము. మన Chief Engineer తయారుచేసిన estimates 34 లక్షలు అయితే ఢిల్లీప్రభుత్వంవారి రైల్వే ఇంజనీర్లు ఈ రైల్వేలైను వేయడానికి 60 లక్షలకు estimates తయారుచేశారు. అది మీరు ఇచ్చుకుంటే మేము వేస్తామని సమాధానం చెప్పారు. రాష్ట్రఇంజనీర్ల దుబారా 34 లక్షలుఅయితే కేంద్రప్రభుత్వ ఇంజనీర్ల దుబారా 64 లక్షలుఅయింది. ఇది పెద్దసమస్య. దీనినిగురించి తప్పకుండా ఆలోచించాలని నెహ్రూగారు తదితర పెద్దలు చెప్పుతున్నారు. Pole కి సిమెంటు చేసి కాంక్రీటుచేసి Pole స్థాపించడానికి రేటు 35 రూపాయలు నిర్ణయించారు. మట్టితోఅయితే 20 రూపాయలు నిర్ణయించిఉన్నారు. Contract ఇవ్వడంలో జరిగేమోసం గురించి ఈ ప్రభుత్వం తగినశ్రద్ధ తీసుకోలేదని అంటున్నారు. Contract ఇచ్చే విధానాన్ని గురించి, విదేశాలలో Stores కొనుటకు సంబంధించిన వాటిలోగాని, పెద్ద పెద్ద యంత్రాలకుగాని, పరికరాలకుగాని సంబంధించిన contract లు నిర్ణయించే విధానాన్ని ఈ ప్రభుత్వము వచ్చినతరువాత Chief Engineer చేతిలో ఉంచలేదు. ప్రభుత్వం చేతులోకి తీసుకొన్నది. ప్రభుత్వంఅంటే మంత్రులు కాదు. P. W. D. Secretary, Finance Secretary, Chief Engineer ఈముగ్గురినికలిపి ఒకకమిటీగా నియమించడంజరిగింది. పెద్ద పెద్ద Contracts నన్నిటిని కూడా, అంటే విదేశీకంపెనీలనుంచి Tenders వచ్చిన, ఈకమిటీ పరిశీలనచేస్తుంది, Chief Engineer Superintending Engineer మొదలైన వారు 10 వేల రూపాయలకు మించినవన్నీకూడా పత్రికలో ప్రకటనచేసి Tender లు పిలుస్తున్నారు. లేదనే అపోహ ఎట్లావచ్చినదీ నాకు తెలియదు. emergency ఉన్న కొన్ని కొన్ని చోట్ల Tender లలో తగినంతగా అవకాశం ఉండకపోవచ్చు. అనేకచోట్ల గ్రామాలకు సంబంధించిన స్కీములను అమలు జరపవలసి వచ్చినప్పుడు Department ద్వారా తొందరగా జరిపించండి, అక్కడక్కడ ఫలానా

27th March 1956] [Sri G. Latchanna

వసతులకు సరఫరా కావాలి కాబట్టి మీరు department ద్వారా జరిపించండి, అని orders ఇస్తున్నాము. తొందరగా అమలు పరచడానికి contractors ముందుకు రాలేక పోయినందువల్ల, 10 వేల రూపాయలకు తక్కువ ఉన్నపని ఎక్కడైనా ఉంటే Superintending Engineer కంట్రాక్టరును nominate చేసే పద్ధతి ఉన్నది గాని 10 వేల రూపాయలు దాటిన పద్దులన్నీ పత్రికలలో ప్రకటించి tender లు పిలిచి ఏర్పాటు చేసే పద్ధతి అమలులో ఉన్నది అయితే దీనిలో దొంగతనము మొదలైనవాటిని గూర్చి మనవారు చర్చించారు. ఈ ప్రభుత్వం వచ్చిన తరువాత సింహాచలంలో జరిగినటువంటి దాని విషయమై x-branch enquiry కావాలని ప్రభుత్వం orders చేసినది. Enquiry చేయించి prosecution నడిపించదలచుకున్నది. ప్రభుత్వ దృష్టికి వచ్చినది అది ఒక్కటే కాదు. ఉదాహరణకు ఒక చిన్న సంఘటన చెప్తాను. East Godavari జిల్లాలో రాజమండ్రిదగ్గర ఇల్లు అద్దె ఇవ్వకుండా మూడు నెలలనుంచి తిప్పుతున్నారని ఒక ఆడమనిషి post card వ్రాస్తే దానిమీద enquiry చేసి వెంటనే payment చేసి concerned officersను warning ఇచ్చాము. Post cardల ద్వారావచ్చిన భోగట్టాలనుకూడా విడిచిపెట్టడంలేదు. ఆకాశరామన్న ఉత్తరాలుకూడా ex-branch కి పంపిస్తున్నాము. ఇప్పుడు గౌరవసభ్యులు తెలియచేసినవి ఇదివరకు మా నోటీసులోకి వచ్చినవే. చోడవరం కేసు ఇంకా x-branch enquiry లో ఉన్నది, ఏదీ విడిచిపెట్టలేదు. ఇదేవిధంగా సభ్యులందరు శ్రద్ధవహించి ఎక్కడెక్కడ ఏ ఏ లోపాలుఉన్నాయో కనిపెడుతూ ఏదైన అరాచకంగాని, అసందర్భంగాని ఉంటే తెలియజేసినట్లయితే తప్పకుండా వెంటనే అరికట్టడానికి దానిమీద చర్య తీసుకోవడానికి వీలుఉంటుంది. ప్రస్తుతం ఉన్న government ఎలాంటి చిన్నవిషయం అయినా సరే కఠినమైన చర్యతీసుకొనే పద్ధతిలో నడుస్తున్నదిగాని ఇదేదో చిన్నదిగదా పోనిమ్మనే ధోరణి ప్రస్తుతం ఉన్న ప్రభుత్వంలో ఈ department కు సంబంధించినంతవరకులేదు. ఇంతవరకు మీరు తెలియజేసినవి ప్రభుత్వ దృష్టికి వచ్చినవే గనుక ఇంక అవసరమైన భోగట్టాలను తెలియజేయవలెనని గౌరవ సభ్యులందరికి మనవి చేస్తున్నాను. సంతకాలు పెట్టి తెలియచేస్తే తమ మీదికి ఏమివస్తుందోనని అపోహపడినవారు సంతకాలు లేకుండా వ్రాసినా సరే చర్య తీసుకుంటామని నేను మనవిచేస్తున్నాను. ఎలాంటి సందేహము అవసరంలేదు.

Sri G. Latchanna] [27th March 1956

Electricity సరఫరా విషయంలో సభ్యులు చాల మంది చర్చించారు. ఈ policy కి సంబంధించినంతవరకు priority దేనికి? అసలు priority ఉండకుండా ఉన్నదేది అని ఆలోచిస్తే మొత్తంమీద "A-Z" వరకు అన్నీ priority మీద వెళుతున్నాయి. Electricity కి Priority ఎందుకు? గ్రామాలలో కావాలని. Unemployment solve కావాలిఅంటే industries development కావాలి. అందుచేత industries కు priority. తిండి సమస్య పరిష్కారం కావాలంటే agriculture కు priority. మెట్ట ప్రాంతాలు అభివృద్ధి కావాలంటే మెట్ట ప్రాంతాలకు priority. ఇందులో కోదండరామయ్యగారు కొండ ప్రాంతాల గురించి తెలియజేశారు. భద్రాచలంకు ఒక స్కీము అమలులో పెట్టాము. అరకులో ఒక స్కీము అమలు కాబోతున్నది. ఇంకను పోలవరం మొదలైన స్కీములన్నీ కూడా పరిశీలనలో ఉన్నాయి. కొండ జాతి ప్రాంతాలు అభివృద్ధి కావాలంటే కొండజాతి ప్రాంతాలకు priority. Priority లేని సమస్యగాని స్కీముగాని లేదని వివరాలు చూచుకుంటే అందరికి అర్థమవుతుంది. Electricity సరఫరా విషయంలో బస్తీకి, పల్లెటూరికి పోటీ అవసరంలేదని నా విశ్వాసం. బస్తీలలో ఈ నాడు ఉన్నటువంటి చిన్న పరిశ్రమలు, పిండి మరలు, కాఫీ మరలు, textile మరలు, ధాన్యం మరలు, oil mills ఇవన్నీ విద్యుచ్ఛక్తి సహాయంతో నడుస్తూ ఉంటాయి. వీలైతే ఇంకా ఎక్కువ చేయాలి. దానికి ఇవ్వాలి. దీనికి ఇవ్వకూడదు అని లేదు. ఇప్పుడున్న పరిస్థితి అదృష్టమైనటువంటి సంతోషకరమైనటువంటిది. కొండ ప్రాంతాలలో ఉన్నటువంటి మన గిరిజన సోదరుల దగ్గరనుంచి electricity కావాలనే అభిలాష, కృష్ణదేశం మొత్తంమీద ప్రబలింది. అందువలన ఇది సంతోషించవలసిన విషయం.

Sri C. P. THIMMA REDDI :—Industries కు మాత్రం ఇచ్చే దానికి రేటు ఎక్కువగాఉంది కాబట్టి ఫ్యాక్టరీ వగైరాలు run చేసేదానికి అవకాశం లేకుండా పోతున్నదని మంత్రిగారికి తెలుసునా? ఒక వేళ తెలిసే పక్షంలో industries develop కావాలన్నప్పుడు తప్పనిసరిగా గిట్టుబాటు అయిన రేటుకు ఇస్తేనేతప్ప పరిశ్రమలు అభివృద్ధి కావడానికి అవకాశం లేదు. మా కందరికీకూడా oil ఇంజన్లు ఉండేవి. వాటన్నిటిని అమ్మేసి మోటార్లు తీసుకురావలసివచ్చినది. మోటార్లు తీసుకురావాలంటే 20 వేలు, 10 వేలు పెట్టవలసివస్తున్నది. అందువలన ఫూను గిట్టుబాటు కావటంలేదు. కాబట్టి మేము మానుకోవలసి వస్తున్నది.

27th March 1956

THE HON. SRI G. LATCHANNA :—రేట్లుగురించి తరువాత మనవి చేస్తాను ఇప్పుడు priority లు, policies మీద మనవిచేస్తున్నాను అందువల్ల భద్రాచలంలో గిరిజనుల గ్రామాలకు electricity అందిందా అనే ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే భద్రాచలం వూరిలో electricity ఉత్పత్తి ఎంత ఉన్నది అనేది మనం ప్రశ్నించుకోవలసిన అవసరమున్నది. ఇప్పుడు దానికి electricity ఎక్కడనుంచో తీసుకువెళ్ళాలి ఇప్పుడు ఈ సభ్యులే, ఈ contract rates, schedule rates గురించి విమర్శించిఉన్నారు. మైలుకు 10 వేల రూపాయలు అవుతున్నప్పుడు రాజమండ్రినుంచి భద్రాచలంవరకు గిరిజనప్రాంత అభివృద్ధిగురించి, రాజమండ్రిలో ఉన్న Power House sub-station నుంచో, కోవూరు sub-station నుంచో తీసుకువెళ్ళాలి అంటె, ఎన్ని మైళ్లు అయితే, అన్ని పదివేలరూపాయలు ఖర్చు అవుతుంది. అందుచేత అక్కడనే ఉత్పత్తి సాధనకావాలి. అక్కడే ఒక sub-station గాని power station గాని ఏర్పాటు కావాలి. అందువల్ల సరఫరావిషయంలో ప్రభుత్వము ఏదైనా పాక్షిక దృష్టిగాని, ఉపేక్షాభావముగాని, ఏ వర్గముపట్లగాని, ఏయొక్క పరిశ్రమపట్లగాని అవలంబిస్తున్నదనే విషయము చర్చించాలనుకోనేముందు, నేను ఇప్పుడు చెప్పిన విషయాలన్నీ పరిశీలిస్తేగాని, సరియైనటువంటి భావము కలగడానికిగాని, పూర్తి పరిస్థితి తెలుసుకోవడానికిగాని అవకాశముండదని మనవిచేస్తున్నాను.

వ్యవసాయములో ఇప్పుడు బావులు ఉన్నటువంటి ప్రాంతాలకు electricity ముందు ఇవ్వాలా, లేకపోతే మా గాణీప్రాంతంలో pumping sets కు ముందు ఇవ్వాలా అనేది ఒక సమస్యగా ఉన్నది. ఇప్పుడు, గూడూరుతాలూకాలోగాని, ఏలూరుతాలూకాలోగాని, లేక ఇంకేదో మా గాణీప్రాంతాన్నిగాని ఒక కేంద్రంగా తీసుకొని, చిత్తూరుజిల్లాలోనో, లేక అనంతపురంజిల్లాలోనో బావులకు సంబంధించిన ఒక కేంద్రాన్ని తీసుకొన్నట్లయితే, అక్కడ ఉత్పత్తి అయిన electricity ని అక్కడివాళ్లకు చలామణీకి ఇవ్వాలి, అదేవిషయంలో ఇక్కడ ఉత్పత్తిని అశ్రద్ధచేస్తే అది తప్పు. కనుక గుడివాడ తాలూకాలో electricity ఎక్కువగ్రామాలకు వచ్చింది, ఇక్కడ తక్కువగ్రామాలలో ఉన్నది, కాబట్టి అది పాక్షికదృష్టి అనే దృక్పథంలో మనము picture ను ఏర్పాటుచేసుకొని మాట్లాడుకొంటె దానికి న్యాయము దొరకదు. దానికి సరియైన సమాధానము ఇవ్వడంకూడ కష్టం.

SRI C. SUBBARAYUDU:—Power supply గురించికాదు. కాని మనకు ఉంటేటటువంటి limited funds లో దేనికి priority ఇవ్వాలి అనేది నిర్ణయించవలసివుంటుంది. ఆ preference మా పెట్టవలసిన అవసరమున్నది.

Demand No. XL—Capital outlay on Electricity Schemes.

[27th March 1956

THE HON SRI G. LATCHANNA :—General గా priority కి సంబంధించినంతవరకు, ఇప్పుడు బెజవాడలో ఉత్పత్తి అవుతున్నదనుకోండి. ఆ బెజవాడ సరిహద్దులలో ఎంతవరకు దాన్ని వినియోగపరిస్తే అంత అదనంగా electricity ని ఇతరత్రా అభివృద్ధిపరచడానికి దానికి తగిన ఆదాయము వచ్చే అవకాశము ఉంటేనే అది సాధ్యమవుతుంది. ఈ Electricity Department అనేది ప్రధానంగా ఒక వర్తకదృష్టిలో జరుగుతున్నటువంటి వ్యాపారసంస్థ. దీనికి ఎంత పెట్టుబడిపెట్టి ఉత్పత్తిచేస్తున్నామో, దాని వినియోగమువల్ల, ఆ ఉత్పత్తి ఖర్చే కాకుండా, దాని సరఫరా జరగడానికి అవుతున్నటువంటి ఖర్చులకు, మరమ్మత్తులకు యావత్తుకు సరిపోతూ మనకు ఆదాయము వస్తూఉంటే, ఇంకా అభివృద్ధిపరచవచ్చు. అందువల్ల, మొత్తంమీద రాష్ట్రనిర్మాణం అయినతరువాత electricity అభివృద్ధి అనేది చాలా అత్యుత్తమస్థాయిలో ఉన్నదని సభ్యులందరు ఒప్పుకొంటూనే 'కాని' అని ఒక comma పెట్టి ఏవేవో కొన్నిసలహాలు, సూచనలు చేశారు దానికి సంతోషమే. కాని ముఖ్యంగా రుక్మిణమ్మగారు ఒక ప్రధానమైన point చెప్పారు; మనకు 16 వేల గ్రామాలు ఉన్నాయి. మన రాష్ట్రనిర్మాణం అయ్యేసరికి మనకు ఉన్నటువంటి విద్యుచ్ఛక్తి సరఫరా అయిన గ్రామాల సంఖ్య 317. ఆ సంఖ్యను ఈ రోజు మనమంతా సుమారు 587 వరకు పెంచుకోగలిగాము. ఈ విధముగా రెండు సంవత్సరాలలో, ఒకరాష్ట్రములో ఇంత electricity ఉత్పత్తిచేసి 270 గ్రామాలకు అదనంగా సరఫరాచేసుకోవడమనేది ఉత్తమస్థాయిలో కనపడవచ్చునుగాని మొత్తము 16 వేల గ్రామాలకు ఈ electricity సరఫరా ఈస్థాయిలో వెళ్ళితే, ఎన్ని పంచవర్ష ప్రణాళికలు కావలసియుంటుంది అని రుక్మిణమ్మగారు ప్రశ్నించారు. వారు చెప్పింది వాస్తవమే. వాస్తవపరిస్థితిని విస్మరించి ఏమి చేయడానికి వీలులేదు. ఈవేళ electricity సరఫరాకు demand ఎక్కువ ఉన్నది. ప్రతిగ్రామానికి, కొండమీద 10 కొంపలుగల ప్రతి కుగ్రామానికికూడ electricity సరఫరాచేస్తే వారికి ఒకవిధమైనటువంటి నూతనవిజ్ఞానమునకు, నూతన ఆర్థికాభివృద్ధికి అవకాశము ఉంటుంది. కనుక ప్రతిచోట ఇది ఉండాలనే కోరిక ఉన్నది. కాని దానికి తగిన ఉత్పత్తిచేసుకోడానికి మనకు ఎంత స్తోమత ఉన్నదో చూసుకోవలసియుంటుంది. మన స్తోమతప్రకారం ఉత్పత్తిచేసుకొంటున్నాము. ఉత్పత్తి చేస్తున్నది ఏమైనా దుర్వినియోగం చేస్తున్నామా, సరఫరాచేయడంలో ఏమైనా అలసత్వంగాని, అశ్రద్ధగాని జరుగుతున్నదా అనే దృష్టితో మనము పరిశీలిస్తే, ఏ అపోహలకుగాని విమర్శలకు గాని ఆధారముండదు మన సభ్యులు కొంతమంది, మాచ్‌ఖండ్ ప్రాజెక్టు తుంగభద్ర ప్రాజెక్టు వీటి

27th March 1956] [Sri G. Latchanna

నిర్మాణము పూర్తికావస్తున్నది, ఒకచోట ఉత్పత్తి జరుగుచున్నది, మరొకచోట జరుగబోతున్నది, ఈ జరుగబోయేది వెంటనే అన్ని జిల్లాలకు, అన్ని తాలూకాలకు అందేటట్లుగా తగిన శ్రద్ధ తీసుకొన్నారా, లేదా అని ప్రశ్నవేశారు. ఆ ప్రశ్నకు సమాధానమంతా ఇదివరకే ఇవ్వబడింది. ఈ విషయంలో ముఖ్యంగా Chief Engineer గారిని అభినందించక తప్పదు. ఎందువల్లనంటే, ఇంకా తుంగభద్ర పని ప్రారంభం కాకముందే, తుంగభద్ర power ఏఏ జిల్లాలకు, ఏఏ కేంద్రాలకు వెళ్ళాలో, ఎక్కడెక్కడనుంచి main lines రావాలో ఆ స్కీము అంతా Chief Engineer గారు blue prints, maps తో సహా తయారుచేసి రాష్ట్ర నిర్మాణం అయ్యేసరికి సిద్ధంగా ఉన్నారు. ఈ విషయంలో ఏదైన అలసత్వం గాని, ఉపేక్షగాని, ఉన్నదనుకోడానికి అవకాశములేదు. ఆ విషయంలో Department ను మాత్రము మనము పూర్తిగా అభినందించాలి. అంతేకాదు, ఈరోజు దేశం మొత్తంమీద ఈ electricity విషయంలో మేము వెనుకబడియున్నాము, పంచవర్ష ప్రణాళికలో మీరు ఇచ్చిన డబ్బు చాలదు, ఇంకా ఎక్కువ ఇవ్వాలి అని కేంద్ర ప్రభుత్వాన్ని అడిగినది మన ఆంధ్రా State ఒక్కటే నని మనవిచేస్తున్నాను. ఇందులో అతిశయోక్తిలేదు. పంచవర్ష ప్రణాళికకు కావలసిన material తక్కువగా ఉన్నప్పటికి, ఈ Department వారు దూర దృష్టితో, మూడేళ్లకు కావలసిన సరుకుకు indent చేసి తెచ్చుకొని stock చేసుకొని, scheme sanction అయిందో లేదో, అది పత్రికలలో చూచీ చూడకుండానే, ఆయా ప్రాంతాల సభ్యులు గాని, ప్రజాసంస్థలుగాని, ప్రతినిధులుగాని, ప్రజలు గాని మా scheme sanction అయిందట, ఎప్పుడు ఇస్తారు, ఎప్పుడు ఇస్తారు అని అంటే, ఫలానా తేదీకి ఇస్తాము అని చెప్పగలిగిన స్థితిలో ఈ department పని చేసింది. ఈ విషయంలో ఎవరు ఏలాటి అపోహపడడానికి అవకాశంలేదని మనవి చేస్తున్నాను.

ఇక మూడవ విషయము ఉన్నది విద్యుచ్ఛక్తి సప్లయిని గురించి అనంతపురం జిల్లా సభ్యులే పదిమంది మాట్లాడారు. వారికి ఎక్కువ బాధాకరముగా ఉన్నట్లున్నది. కాబట్టే అంతమంది మాట్లాడారనుకుంటున్నాను. వారికి ఎక్కువ బాధాకరముగా ఉంటే ఉండవచ్చు. అందుకు నేను కాదనను. మన మిత్రుడు కూడా నారాయణప్ప గారు 'గత 18 మాసములలో పాతరసముగా electricity develop అయింది కాని, మాకుగూడ వస్తుందని అనుకున్నాము, కాని ఆ ఆశలో చాలా బాధ కన్పిస్తున్నదని' మాట్లాడారు. కాని ఆ బాధ చాలా అపోహలతో కూడుకున్నదని

Sri G. Latchanna] [27th March 1956

గూడ నేను అంటున్నాను. కాని అందులో విశాల దృష్టిగాని విశాలభావముగాని, లేదని అనుకోకూడదని అంటున్నాను. వారు ఆవిధముగా అనుకోరని నా విశ్వాసము. అటువంటి అపోహలకు అవకాశము ఏ మాత్రము లేదని నేను వారికి, యింకా మాట్లాడిన సభ్యులకందరికీ మనవిచేస్తున్నాను. ప్రభుత్వము ఎదుటనున్న లెక్కలను బట్టి వారికి నేను వివరములను యిస్తున్నాను. గత 1½ సంవత్సరములుగా అంటే, 1—10—53 మనకు రాష్ట్రము ఏర్పడిన తేదీనుంచి 31—3—1955 తేదీవరకూ అనంతపురము జిల్లాలో 18 గ్రామాలు electrify అయినవి ఇది జరగలేదని ఎవరూకూడ చెప్పటానికి అవకాశములేదు. ఇందులో మాత్రము అభివృద్ధి లోపము ఏమీలేదు. నేను మన రాష్ట్రములో ఎక్కడెక్కడ electrify అయినది ఏ స్కీము investigation అయినది, శాంక్షను అయినది, యిటువంటి భోగట్టాలను అన్ని జిల్లాలకు సంబంధించినవి యిప్పుడు తీసుకునివచ్చాను. ముఖ్యంగా అనంతపురం జిల్లా సభ్యులు చాలా ఆతురతతో మాట్లాడారు. కాబట్టి వారి జిల్లాకు సంబంధించిన వివరాలను యిప్పుడు నేను చదివి వినిపించదలచాను ఒకవేళ ఎక్కడైనా ఆలస్యము జరిగి ఉంటే, అందుకు క్షమించాలని మనవిచేస్తున్నాను. అనంతపురం జిల్లాలో 1—10—53 తేదీనుంచి 31—3—55 తేదీవరకు అమలుజరిగిన స్కీముల సంఖ్య చెబుతున్నాను. ఈ 1½ సంవత్సరములలో అమలుజరిగినవి 11 స్కీములు. తరువాత ఈ 11 మాసములలో అమలుజరిపినవి 9 స్కీములు. 1½ సంవత్సరములలో 11 స్కీముల క్రింద ఖర్చుచేసిన మొత్తము 23, 73, 300 రూపాయలు. తరువాత 11 మాసములలో జరిపిన 9 స్కీములకు ఖర్చు 12,80,090 రూపాయలు. అందువల్ల యిందులో జరిగిన అశ్రద్ధ యేమీ లేదనే చెప్పగలను. మందగొండితనము, వెనుక చూపు ఉన్నదని చెప్పడము భావ్యముకాదు. ఇది ఎవరియొక్క తాతగారి సొత్తుకాదు. (Interruption) ప్రతి ఒక జిల్లా భోగట్టాకూడ తెచ్చాను.

కడపజిల్లాలో ముందు 11 మాసములలో అమలుజరిపిన స్కీములసంఖ్య రెండు గత 12 మాసములలో అమలుజరిపినవి అయిదు. గత 18 మాసములలో ఖర్చు పెట్టినది 93,890 రూపాయలు. ఈ 12 మాసములలో ఖర్చుచేసినది, 10,69,400 రూపాయలు. సున్నయ్యగారుకూడ శ్రీకాకుళంజిల్లా సంగతి అడిగారు. వారికి నేను చెప్పేదియేమిటంటే, వెనుకటి 18 మాసములలో ఆ జిల్లాలో అమలుజరిపిన స్కీములు పది. తరువాత జరిగిన 12 మాసములలో అమలుజరిగిన స్కీములసంఖ్య 7. అందుచేత ఒక జిల్లాకు ప్రత్యేకదృష్టి చూపబడుతున్నదని, మరొకజిల్లాపై తక్కువచూపుఅని, యింకొకజిల్లాలో ఎక్కువచూపుఅని అనుకోవటానికి ఆస్కారమూలేదు. ఒకవేళ administration లో ఏమైనా లోపాలుంటే.ఉండవచ్చు.

27th March 1956] [Sri G. Latchanna

కొంత ఆలస్యముకూడ జరిగితే జరగవచ్చు. అంతమాత్రముచేత అపోహపడ నవసరములేదని నా మనవి. ఒకజిల్లాకు తగ్గించడము, మరొకజిల్లాకు ఎక్కించడము అనేదృష్టి నాకు ఎంతమాత్రములేదని నమ్మగోరుతున్నాను. ఈ రోజులలో మంత్రులుగా ఉన్నవారు అవిధముగా చేస్తున్నారనిఅంటే, అది నేను నమ్మను. ఇది వరకు ఎవరైనా మంత్రులుగాఉన్నవారు ఆ విధముగా చేశారనిఅంటే, అదిగూడ నేను నమ్మజాలను ఎందుకంటే వారు ఆ విధముగా చేయుటానికి వీలులేదని నా విశ్వాసము ఒకవేళ ఎవరైనా యిదివరకు చేయగలిగారనిఅంటే, ఇక వారిని దేవుడే శిక్షించాలని నా విశ్వాసము. అందువల్ల నేను యీ విషయములో చెప్పటానికి ఏమీలేదు. నా విషయములో ఏలాంటి అశ్రద్ధగాని, మందగొండితనముగాని, వెనుకచూపుగానిలేదు. ఉండటానికి అవకాశములేదు. ఇప్పుడు అనంతపురము జిల్లాకు సంబంధించినంతవరకు investigation లో ఉన్న స్కీములు Domestic services కు సంబంధించినవి చదువుచున్నాను. ఇందులో వాటి యొక్క estimated amounts కూడ చేర్చబడినవి.

| | | Rs. |
|---|---|---|
| 1. | Domestic Services in Hindupur | 41,550 |
| 2. | Supply to Pulakurthi and Somalapuram | 93,200 |
| 3. | Supply to Yadiki; Rayalacharuvu, etc., villages. | 5,05,400 |
| 4. | Supply to Dargakondapuram, Nagireddipalem and Veparalla. | 1,83,450 |
| 5. | Supplly to Muridi ... | 99,900 |
| 6. | Supply to Gooty Panchayat area near Railway station. | 62,300 |
| 7. | Supply to Godisalapalle; Ambapuram and Uddijal villages. | 3,14,400 |
| 8. | Supply to Police Training College, Sri Lalitha Prasad Oil Mills, Sri Gowri Automobile works, and 60 Nos. Domestic services in Anantapur District, | 51,100 |

Sri G. Latchanna] [27th March 1956

| | | |
|---|---|---|
| 9. | Supply to Ganigera and Jakkaladiki in Rayadrug Taluk. | 1,94,640 |
| 10. | Supply to Kunthuru etc, villages in Dharmavaram Taluk. | 99,960 |
| 11. | Supply to Nayanapalle, Hindupur taluk. | 33,850 |
| 12. | Supply to Kodikonda ... | 1,19,800 |
| 13. | Supply to Krishnareddipalle and Chiy. yedu. | 2,33,400 |
| 14. | Supply to Hindupur Water Works ... | 16,600 |
| 15. | Supply to Chetnepalle and Surasinga-palle. | 42,300 |
| 16. | Supply to Kondu Panchayat ... | 65,000 |
| 17. | Installation of 1 No 100 K. V. A. transformer in Anantapur Distribution. | 19,500 |
| 18. | Supply to Bukkapatnrm and surrounding villages. | 17,36,900 |
| 19. | Supply to Kalyanadrug and surrounding villages on 10 year gross revenue basis | 25,533 initially rising to 34·75 lakhs. |
| 20. | Supply to Renimakulapalle and Nimbagal in Gooty taluk. | 98,640 |
| 21. | Supply to Chabala Panchayat ... | 75,250 |
| | Total ... | 66,40,440 |

*Schemes under investigation.*

| | | |
|---|---|---|
| 1. | Suppy to Gadikal, Vidapanakal etc., villages in Uravakonda sub-taluk. | 8,62,200 |
| 2. | Supply to villages in Madakasira taluk by extending 32 K. V. Line to Madakasira. | 19,00,000 |

| | | |
|---|---|---|
| 3. | Supply to Mutstukota, Kondapuram etc., villages. | 1,64,000 |
| 4. | Supply to Upparapalli ... | 53,500 |
| 5. | Supply to Nyamaddala and enroute villages fr om Dharmavaram. | 4,00,000 |
| 6 | Supply to Kuderu firka ... | 7,00,000 |
| 7 | Supply to Malyavantam and Tadimarri etc , villages. | 2,00,000 |
| 8. | Supply to Tanekallu etc , villages ... | 6,50,0C0 |
| 9. | Supply to villages in Mahammadabad firka in Kadiri taluk. | 8,00,000 |
| 10. | Supply to Narlapalle firka ... | 4,00,000 |

ఇవి అన్నిగూడ యిప్పుడు investigation లో ఉన్నవి ఇప్పుడు కొన్ని అమలు జరిగినవి. Sanction చేసినవి కొన్ని execution లో ఉన్నవి. ఆ లిస్టుకూడ ఇక్కడ ఉన్నది. అధ్యక్షులవారు time లేదని అంటారేమోగాని, అవికూడ చదవటానికి వారు అనుమతిస్తే, చదువుతాను.

An hon. MEMBER :—చిత్తూరుజిల్లావి ఉన్నవా ?

THE HON. SRI. G. LATCHANNA :—చిత్తూరుజిల్లాకికూడ ఉన్నవి చదువమని అంటారా ?

AN hon. MEMBER :—Investigation లో ఉన్నవి చదువండి.

SRI C. SUBBARAYUDU :—ఇవి అన్ని ' pending sanction by the Government ' క్రిందకు వస్తాయా ?

THE HON. SRI G. LATCHANNA :—ఈ లెక్కలన్ని చాలా latest లెక్కలు, మొన్న February ఒకటవతేదీవారికిఉన్న Up-to-date list Electricity department నుంచి నేను యిందుకోసము తెప్పించాను. అందువల్ల యివి latest లెక్కలంటే చెప్పగలను. ఇంకా execute కావలసినవి కొన్ని ఉన్నవి. శాంక్షను అయినవి కొన్ని execution లో ఉన్నవి. ఇంకా కొన్ని execution జరపలేదు.

An hon. MEMBER :—అన్ని జిల్లాలవి గూడ చదువుతారా ?

THE HON SRI G. LATCHANNA :—అన్ని జిల్లాలవిఉన్నవి. అధ్యక్షులవారు చదువమంటే, చదువుతాను. నాకు అభ్యంతరము లేదు.

MR DEPUTY SPEAKER :—మంత్రిగారివద్ద జిల్లాలవారీగా list ఉన్నదని అంటున్నారు. కావలసినవారు వారిదగ్గరనుంచి తీసుకుని చూచుకో వచ్చును.

THE HON SRI G. LATCHANNA :—అందువల్ల యిప్పుడు agriculture కొరకు electricity సరఫరాచేసే విషయములో నేను వారికి మనవిచేశాను. పెద్ద తిమ్మారెడ్డిగారు, సుబ్బారాయుడుగారు, బాపినీడుగారు, వారికి electricity రాలేదని అన్నారు. పెద్ద తిమ్మారెడ్డిగారి ప్రాంతములో కొన్నింటికి కొద్ది రోజులలో ప్రారంభోత్సవము జరగబోతున్నది. కాబట్టి agriculture పట్లగూడ ఏలాంటి అశ్రద్ధ చూపడములేదు. సభ్యులు అటువంటి అపోహలుపడటానికి, ఏవిధమైన విమర్శలు చేయటానికి అవకాశములేదు. కాని ఏ ప్రాంతములోనైనా, అక్కడ నిజముగా డిమాండు ఉన్నదా ? లేదా డిమాండు ఉన్నప్పటికీ, అది దాచుకుని లేదని అంటున్నారా, అనేటటువంటివివరాలన్నిగూడ ప్రభుత్వము పరిశీలించి చేయవలసియున్నది. ఈసంస్థ వ్యాపారసంస్థ. విద్యుచ్ఛక్తిని సప్లయి చేస్తాము, మీకు కావలెనా, మీకు కావలెనా అని, డిపార్టుమెంటే canvass చేయవలసిన సంస్థ. ఎప్పుడెప్పుడు ఎవరికి electricity తో అవసరము ఉంటుందా, సప్లయి చేద్దామా అని ఎదురుచూస్తూవుంటాము. అందువల్ల electricity తప్పని సరిగా supply చేయటానికి డిపార్టుమెంటు తయారుగా ఉంటుంది, ప్రభుత్వము electricity ని దాచుకోదు అని మనవిచేస్తున్నాను. ఇంకా మిగిలినస్కీములు చాలా ఉన్నవి. ఇప్పుడు అవసరములేదని, వాటియొక్క statistics నేను collect చేయించలేదు. ఇక్కడ సభ్యులు అడుగుతారని తెలిసివుంటే, వాటి వివరాలుగూడా తెప్పించి ఉంచేవాడినే. కాని గత ఏడాదిలో అమలులోకి వచ్చిన ప్రతి గ్రామీణ స్కీములోకూడ agricultural service కొరకు estimates తయారైనవి. కొంతమంది agreements వ్రాసియిచ్చినవారుకూడ సుమారు నూటికి 60, 70 మంది electricity ని ఉపయోగించుకోకుండా ఊరకున్నారు. వారికి electricity pumps కూడా ఉన్నవి. కాని electricity ని ఉపయోగించడములేదు. ఏమండీ, electricity ఉపయోగించలేమి అని అడిగితే, ఉండండి, తరువాత చూస్తాము అని అన్నారు. ఇంకా కొంతమంది అసలు కనబడ లేకపోవడము, అందువల్ల agricultural services కు సంబంధించినంత

మటుకు డిపార్టుమెంటు అశ్రద్ధ చూపడములేదు. కృష్ణా గుంటూరుజిల్లాలలో delta taluks లో ఉత్పత్తి ఎక్కువగా ఉన్నది. Electricity కూడ available గా ఉన్నది. అక్కడ స్టేషన్లలో capacity తక్కువగా ఉంది. Demand జాస్తిగా ఉంది. అందుచేతనే మన రంగయ్యగారిలాంటివారు వ్యవసాయదార్లకు electricity యివ్వడములేదని చెప్పటానికి అవకాశము కలుగుతున్నది. ఆప్రాంతాలలో availability తక్కువ ఉండి, ఎక్కడైతే యీ స్కీములు కొత్తగా అమలుపరుస్తున్నామో, అక్కడివారే estimation అయిన స్కీములను వారికి pump sets ఉన్నప్పటికినీ, అమలుపెట్టుకోకుండా ఉంటున్నారు. ఎందుకు అమలుపెట్టుకోరని ఎవరైనా అడిగితే, ఉండండి, దానిసంగతి తరువాత చూస్తామని అంటారు. పైగా వారికోసము వెళ్లితే, అసలు మనిషి కనబడడు. కాబట్టి యిటువంటి విషయాలు అన్ని సభ్యులందరూ గమనిస్తారని విశ్వసిస్తున్నాను. దీనిని బట్టి Electricity Department విద్యుచ్ఛక్తి సప్లయిచేయడములో అశ్రద్ధ ఏమాత్రము చూపడములేదు. Electricity తప్పకుండా సప్లయిచేయాలనే ప్రభుత్వం శ్రద్ధ తీసుకొంటున్నది. తరువాత electricity supply చేసే రేట్లనుగురించి ప్రశ్నకూడ వచ్చింది. Rates ను గురించి యిదివరకు అనేకసందర్భాలలో, గతబడ్జటు సమావేశములోనైతేనేమి, ఈ సమావేశములోనైతేనేమి, చర్చలు జరిగినవి. క్రిందటిసారి బడ్జటు సమావేశములో యీసంగతి చర్చకువచ్చింది. రేట్లవివరాలు యిప్పుడు సభ్యులకు చెబుతున్నాను. 1955-56 వ సంవత్సరము వచ్చేదాకా electricity department వల్ల అయ్యేఖర్చు, వచ్చే ఆదాయము లెక్కచూస్తే, ప్రతీ సంవత్సరముకూడా 70 లక్షలు, 80 లక్షలు, 90 లక్షలు యీ విధముగా నష్టముతో పనిచేసింది. కాని 1955-56 వ సంవత్సరమునకు మాత్రము సుమారు 70 లక్షలుదాకా లాభమువచ్చింది. గత సంవత్సరము capital expenditure పై చేసిన loan మీద 180 లక్షలు interest కట్టాము. ఈ సంవత్సరము వడ్డీ క్రిందనే 170 లక్షలదాకా కట్టాలి. దీనినిబట్టి మనకు వచ్చినలాభము interest కట్టటానికికూడ చాలలేదు. అందువల్ల యీ సంస్థను యింకా వృద్ధిచేసుకోవలసి యున్నదని నరసింగరావులాంటి కార్మికనాయకులకు చెప్పకతప్పదు. అటువంటి వారికి చెప్పకపోతే, మన విద్యుచ్ఛక్తి ధర్మమును విస్మరించుచున్నామని అంటారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— కార్మిక నాయకులు మంత్రులుగా ఉండి విస్మరించవచ్చునా ?

[27th March 1956

THE HON. SRI G. LATCHANNA .—కార్మిక నాయకులు మంత్రులు అవుతున్నారు. తరువాత వారు బాధ్యులుకూడ అవుతున్నారు ఎవరు మంత్రి అయినప్పటికిన్నీ, వాస్తవిక పరిస్థితులను దాచడములేదని అంటున్నాను. దాచటానికి అవకాశము లేదుకూడా. ప్రభుత్వానికిఉన్న ఆర్థికపరిస్థితులలో కార్మికుల servicesను temporary గానే సంవత్సరాల తరబడి జరుపుతూ వస్తున్నాము. Confirm చేసిన తరువాత వారిని తీసివేయకూడదు. ఒకవేళ తీసివేస్తే అప్పుడు సభ్యులలో ఎవరైనాగాని, యింకొకరుగాని వకాల్తునామా పుచ్చుకుని High Court లో writ వేయటానికి సిద్ధపడుతారుగదా ! అందువల్ల అది సాధ్యంకాదు. Construction offices లో ఉన్నవారు temporary service లోనే ఉండాలి. Operation Sections లో ఉన్నవారు, మూడు సంవత్సరాలు, నాలుగు సంవత్సరాలు సర్వీసుఅయిన వారిని, technicians ను అందరినీ కూడా ప్రభుత్వం confirm చేస్తున్నది. Confirm చేయకుండా ఉండడములేదు. Confirm అయిన మిగతా వారందరికీ facilities అన్నీగూడ provide చేస్తున్నాము. పని చేసేవారు line మీదపోయి కష్టపడి, ప్రాణమును risk చేస్తూ, ప్రమాదానికి గూడ సిద్ధపడే వారిని ప్రభుత్వము అశ్రద్ధచేస్తున్నారేమోనని కార్మిక నాయకులు అనుకోవటము సత్యదూరమని అంటున్నాను. కాని వారు ఆధోరణిలో మాట్లాడితే, లాభములేదు. అటువంటి అపోహాలకు అవకాశములేదు. వారియందు ప్రభుత్వం తగు శ్రద్ధతీసుకొంటూనే యున్నది.

రేట్ల సందర్భంలో ముఖ్యంగా మనవిచేసేది ఏమంటే, రేట్లు revise చేయడానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది. పంచాయతీ బోర్డులలో fixtures విషయంలో ఇబ్బందిఉన్నది. నేనుకాదనను. కాని ఇవతల Department వారి ఇబ్బంది కూడా పరిశీలించాలి. Department కు నష్టంవచ్చినా గవర్నమెంటుకి నష్టమే Municipality కి నష్టంవచ్చినా ప్రజలకూ, గవర్నమెంటుకీ నష్టమే. నష్టంలేదని నేననను. ఇప్పుడు Department ఎందుకు నెలకి రూపాయి పుచ్చుకుంటున్నది ? సంవత్సరానికి ఒక మారో, రెండు మార్లో wires మారుస్తూ ఉండాలి. Bulb లను fuse లు. పోయినప్పుడల్లా Department వచ్చి వెయ్యాలి. Servicing అంతా కూడా Department దే Municipality కి గాని, పంచాయితీ బోర్డుకిగాని ఏలాంటి ఇబ్బంది పెట్టుకుని పరిశీలించవలసిన అవసరం లేదు. Street lights ఎక్కడపోయినా Department దే జవాబుదారీ. కాని Municipality ది కాదు,

పంచాయితీ బోర్డుది కాదు. అందువల్ల service చేస్తున్నందుకు అవుతున్న ఖర్చును ఇదివఱకు kerosene నూనె దీపాలు పెట్టినప్పుడు అవుతున్న ఖర్చును, లేదా petromax light కు. వాటి స్తంభాలకు అవుతున్న ఖర్చును పోల్చిచూస్తే తక్కువ కాని, ఎక్కువకాదు. ఇంకా తగ్గిస్తే మనకు మిగులుతుందా అంటే మిగులుతుంది. ఖర్చు తగ్గించే అవకాశం ఎంతవఱకూ ఉంటుందనేది ఇప్పుడు ఆలోచనలో లేకపోలేదు. చిన్న చిన్న పంచాయితీ బోర్డులకు మరికొన్ని ఇబ్బందులున్నాయి. వాటిని గురించి కూడా సుబ్బారాయుడుగారు తెలియజేశారు. పంచాయితీ బోర్డుకు అన్ని వీధులలోనూ lights వెయ్యడానికి ఆర్థిక స్తోమతు చాలదు. అన్ని వీధులలో వెయ్యకపోతే ధనవంతుల వీధులలో వేసుకుంటున్నారు, దరిద్రులను విడచిపెడుతున్నారని వెంకటేశ్వర్లు గారు కేకలు పెడతారు.

SRI R. B. RAMAKRISHNA RAJU :—పంచాయితీ బోర్డుల విషయంలో service చేయడం అవసరమే. Service చేసినా చేయకపోయినా నెలకు రూపాయి తీసుకోకుండా, ఎంత service చేస్తే దానికి తగినంత పుచ్చుకోడానికి నిర్ణయించాలి. కొన్ని చోట్ల service జరగవచ్చును, కొన్ని చోట్ల జరగకపోవచ్చును. ఆ విధంగానైనా లాభం కలగవచ్చును. Service చేసినా చేయకపోయినా నెలకు ఒక రూపాయి ఇవ్వాలంటే చిన్న చిన్న పంచాయితీలకు చాలా కష్టంగా ఉంది. Service చేసినంతవఱకూ ఏమి ఖర్చవుతుందో అది తీసుకోండి.

THE HON. SRI G. LATCHANNA :—Service అంటే bulb ఖరీదు ఎంత? Unit ఖరీదెంత ? అనే ప్రశ్న కాకుండా, అక్కడకువచ్చి attend అవుతున్న supervisor, Lineman, Assistant Engineer, Technician వంటివారి తనిఖీలకు అయ్యే ఖర్చులు అన్నీ చేర్చి service క్రింద charge చేస్తారు. ఒక్క material ఖరీదుమాత్రమే కాకుండా, దానికి staff యొక్క maintenance charges కూడా ఈ service లోనే వస్తాయి. ఈ సమస్య ఇప్పుడు పరిశీలనలోయున్నది. Chief Engineer గారు ఈమధ్యనే Inspector General of Local Boards తో కూడా చర్చించడం జరిగింది. అందుచేత అన్ని వీధులకూ lights ఇవ్వాలంటే వచ్చే remuneration తక్కువే ఉంటుంది. ఈ remuneration తక్కువైనప్పుడు దానిని ఎట్లా compensate చెయ్యడం అనేది ఒక సమస్య. దాన్ని గురించి Finance Department వారితో కూడా చర్చించవలసియున్నది. ఇప్పుడది పరిశీలనలోయున్నదని మనవిచేస్తున్నాను. శేషాద్రిగారు, చెన్నయ్యగారు కొన్ని scheme లను గురించి refer చేశారు. మన ప్రభుత్వం

Sri G. Latchanna] [27th March 1956

వచ్చేటప్పటికి 11% remuneration ఉంటూ ఉండేది. తరువాత అది ప్రభుత్వం పునరాలోచన చెయ్యాలని అభిప్రాయంకలగడమే కాకుండా, సభ్యులు ఒక మెమోరాండం అందజేయడం, దానిమీద ప్రభుత్వం గ్రామీణప్రాంతాలకు సంబంధించినంతవరకూ 10% తీసుకోవాలని నిర్ణయానికివచ్చారు. నిర్ణయానికి వచ్చి అమలుపెట్టాలనేసరికి మనకున్న 6½ కోట్లరూపాయిలు 1955-56 లో ఖర్చయిపోవడమే కాకుండా ఖర్చు అదనంగా 40 లక్షల రూపాయిలు అయింది మనకు allot ఐనదానికంటె, మన commitments తాలూకు bills pay చెయ్యాలంటే సుమారు 45 లక్షల రూపాయిలు హెచ్చు అయింది. అందువల్ల 10% అనే నిర్ణయానికి వచ్చినతరువాత, 10% లేక 11% అనే సమస్యమీద, ఉండిపోయిన scheme లన్నీకూడా ఈపేడు execution కి తీసుకోలేకపోయినాము. ఈ నిర్ణయానికి వచ్చేసరికి ఉన్న డబ్బు ఖాళీకావడమే కారణం. కాని, మరేవిధమైన ఉపేక్షకాదు. అందువల్ల ప్రభుత్వం ఈ April లో జరిగే Standing Finance Committee సమావేశంలో ఈ 10% schemes అన్నీకూడా—అందులో రేపల్లె scheme కూడా ఉన్నది—అమలులోపెట్టవలసిందిగా ప్రభుత్వం orders వెయ్య వచ్చునుగాని, అశ్రద్ధచెయ్యలేదు.

Sri B. G. M. A. Narasinga Rao :—అధ్యక్షా, మనరాష్ట్రంలో కూడా Electricity Board ప్రవేశపెట్టేటట్లయితే ఇంకా తక్కువలో ఈ విద్యుచ్ఛక్తి నిర్మాణం సాగుతుందని, ఈ 10% కన్న ఇంకా చాలా తక్కువతో ఎన్నోసౌకర్యాలు చేసుకోవచ్చునని చాలామందికి అపోహగాఉన్నది. అందుచేత విద్యుచ్ఛక్తి చట్టంప్రకారం, రాష్ట్రవిద్యుచ్ఛక్తిబోర్డు ఎందుకు ఏర్పాటుచెయ్యడం లేదో ప్రభుత్వం చెప్పడంలేదు Standing Finance Committee చర్చిస్తామని అంటున్నారేగాని, మంత్రిగారు ఆవిషయాన్నిగురించి చెప్పాలని కోరుతున్నాను.

The Hon. Sri G. Latchanna :—అది కొత్తసమస్య. దాన్నిగురించి ఒకటేమాట చెప్పదలచాను. నరసింగరావుగారు చెప్పినట్లు అది అపోహ. వాస్తవంకాదు. Electricity Board అనేది వస్తే అది పూర్తిగా business-like గా ఉంటుంది. ఎక్కువలాభం వచ్చే scheme ఏదుందో అదే తీసుకుంటారుగాని గవర్నమెంటుమాదిరిగా ప్రజలకు జవాబుదారీ వహించేస్థితి ఆ Board కు ఉండడానికి వీలుండదు. అందుకే ఈ ప్రభుత్వం బోర్డు ఏర్పాటుకు అంగీకరించదు. ఈ Board మీద ప్రభుత్వానికున్న అజమాయిషీ అక్కరలేకుండా స్వతంత్రశక్తి తోగాని ఈ Board ఏర్పాటుకు నే నంగీకరించ

మని అనేక పర్యాయములు ముఖాముఖీచర్చలలో ఐతేనేమి, ఉత్తర ప్రత్యుత్తరాలలో ఐతేనేమి కేంద్రప్రభుత్వంవారితో ఖచ్చితంగా చెప్పడం జరిగింది. Board ఏర్పాటువల్ల మనకు నష్టమేగాని లాభంలేదనిమాత్రం మనవిచేస్తున్నాను.

SRI B. G. M. A. NARASINGA RAO :—అది ఉంటే కార్మికుల పరిస్థితేనా బాగుపడుతుందని అపోహ ఉంది.

THE HON. SRI G. LATCHANNA: —అదంతా అపోహే. అటువంటి అపోహలు పెట్టుకోవద్దని నా మనవి. వాస్తవమైన అభిప్రాయాలున్నా తగదాలేదు గాని అపోహలుమాత్రం పెట్టుకోవద్దు. Board అనేది పూర్తిగా లాభాలు సంపాదించుటకు ప్రయత్నిస్తుంది. Workers కు ఎక్కువజీతం ఇచ్చి, లాభాలు తగ్గించుకోడానికి ఏ బోర్డు ప్రయత్నించదు.

రుక్మిణమ్మగారు మడకశిరకు సంబంధించిన స్కీమువిషయంచెప్పారు. 19 లక్షల రూపాయిలతో ఒక పెద్దస్కీము investigation పూర్తి అవుతోంది.Sanctionకు రాబోతూఉన్నది. Chief Engineer గారిదగ్గర ఉన్నదని అనుకుంటాను. తరువాత A. C. సుబ్బారెడ్డిగారు చెప్పినవిషయాలను గురించి నేను మనవిచేస్తాను. చోడవరం విషయంలో Police investigation ఇంకా జరుగుచున్నది. అది పూర్తి ఐన వెంటనే తగినచర్య తీసుకుంటాం. సింహాచలంవిషయంలో action తీసుకోవడమైనది. వారు చెప్పినదానిలో మరొకవిషయం ఉంది. ఈ Chief Accountant ఎవరూ? అని.

SRI A. C. SUBBA REDDI .—Action తీసుకున్నాం అన్నారు. ఏమి action తీసుకున్నారు ?

THE HON. SRI G. LATCHANNA :—Prosecution కు orders ఇచ్చాం. ఈ గవర్నమెంటు వచ్చేసరికి, సరియైన ఆధారాలు లేనందున defer చేస్తే మంచిదనే note నా file లో యున్నది. అది సరికాదు. Enquiry చేయించి, prosecution కు orders వేశాం. ఆయన arrest కూడా జరిగింది. Chief Accountant గారి office, superfluous office అని, అది అనవసరమైన తద్దినంలా ఉన్నదని సుబ్బారెడ్డిగారు తెలియజేశారు. ఈ Department కు Accountant Office తప్పనిసరి. Revenues Licences ఇవన్నీ Chief Engineer స్వాధీనంలో నేయుంటే checking సరిగా ఉండదు. Officers అంతా ఏకమై గూడుపుఠాణీ చేసుకుంటున్నారని అపోహకు కారణమవుతుంది. అందువల్ల

Sri G. Latchanna] [27th March 1956

Chief Accountant office ఉండడంతప్పదు. జిల్లా stores కు సంబంధించి సంతవరకూ అక్కడ జరిగిన దొంగతనం కప్పిపుచ్చుకోడానికి Central stores పద్ధతి వచ్చిందనుకోవడం పొరపాటు. ఇదివరకున్న Stores Assistants పద్ధతి తీసెయ్యడం జరిగింది. Stores అన్నిటిమీద ఇకమీదట proper direct control ఉండడానికి ఏర్పాటు జరుగుతోంది.

Sri A. C. SUBBA REDDI :—నేను జిల్లా Stores లో తప్పులన్నీ కప్పిపుచ్చడానికి Central stores వచ్చిందని చెప్పలేదు. నేనుచెప్పింది జిల్లా Stores లోఉన్న 40 లక్షల రూపాయిల Stock central stores కి రాలేదు. అది విచారించమని చెప్పానేగాని, అక్కడ తప్పులు కప్పిపుచ్చడానికి వచ్చిందని చెప్పలేదు

The Hon. Sri G. LATCHANNA :—ఐతే సంతోషమే. గాని, Stock ఎక్కడ ఏమాత్రం లోపంఉన్నా దాని విషయమై ప్రభుత్వం అశ్రద్ధ వహించి ఉపేక్షచేసే అవకాశంఉండదు. సుబ్బారెడ్డిగారికి ఈ విషయమై ఏమీ సందేహం ఉండనక్కర్లేదు. ఇంకా ఎక్కువ భోగట్టాఇస్తే వారికి కృతజ్ఞుడనుగా ఉంటాను.

శాంతప్పగారు ' ఏమికర్మమో ! అందరికివస్తోంది ; మాకుమాత్రం రావడం లేదని చెప్పారు. కల్యాణదుర్గానికి 25 లక్షలరూపాయిల స్కీము సిద్ధంగా ఉన్నది, 10% స్కీములలో ఇదికూడా ఒకటిఅని మనవిచేస్తున్నాను. ఇలాంటి సమాధానమే చిదంబరరెడ్డిగారు చెప్పినదానికి మనవిచేసాను అనుకుంటాను. అశ్రద్ధ చేయడంలేదు. పూర్వపు 18 మాసాల్లో 18 గ్రామాలకు, గత 12 మాసాలలో 18 గ్రామాలకు Electricity వచ్చింది రావలసిన గ్రామాలసంఖ్య తెలియ చేశాను. వారికి ఎటువంటి అపోహఉండదని ఆశిస్తున్నాను, శేషాద్రిగారు remuneration గురించి మనవిచేసారు Remuneration విషయంలో ఒకటి తెలియచేయాలి. ఏ principle లేకుండా Electricity ఇవ్వడానికి అవకాశం లేదు. కొన్ని నిబంధనలుఉండాలి. అప్పుడే ఇవ్వగలుగుతాము. Departmentలో అభివృద్ధిఉండాలి. Remuneration, Scale అనేది ఉండడం అవసరం. 10% కన్న తగ్గితే దీనివల్ల వచ్చేనష్టాన్ని భర్తీ చేయడానికి గవర్నమెంటు పూనుకోవాలి, ఇతర ఆదాయాలనుంచి దీని compensate చేయాలి. ఖర్చువడ్డీ లను భరించుకోడానికి చూస్తున్నాము. సుబ్బారెడ్డిగారు చెప్పినట్లు అమలు అయి నంతవరకు ప్రతిఫలంవస్తుందా, రాదా అనే దానివిషయంలో ప్రారంభంలో esti- mates ప్రకారం పూర్తి ప్రతిఫలం రావడంలేదని తెలిసికూడా క్రొత్త

స్కీములు గ్రామాలలో అమలు చేస్తూనే ఉన్నాము. వెనుకబడిన ప్రాంతానికి అభివృద్ధి కావాలంటే, ముందు electricity ని అందుబాటులో పెడితే క్రమేణా ఉపయోగించడానికి అలవాటుపడతారు. తగినంత ఆదాయంవస్తేనే electricity schemes ను అమలుజరపాలనే ధోరణిలో ప్రభుత్వంలేదు. ఎంత నష్టాన్ని తట్టుకోగలమో ఆలోచించుకొని అంతనష్టాన్ని భరించి అమలుచేయడం జరుగుతోంది. గ్రామాలలోని స్కీములవిషయమై లాభమే ప్రధానమైన principle గా ప్రభుత్వం భావించడంలేదని మనవిచేస్తున్నాను. నారాయణప్పగారు పామిడి-గుంతకల్ సప్లయిగురించి చెప్పారు. ఇది investigation లో ఉన్నది. అనంతపురంజిల్లా స్కీములు చదివాను. ఆయన చెప్పినస్కీములు అందులో ఉన్నాయి. పరిశీలనలోనికి వచ్చాయి. Agricultural load ఎక్కువచేసే విషయంలో, Chittoor zone కు electricity ని మనం మద్రాసునుంచి కొనుక్కొంటున్నాము. మద్రాసుకు additional load ఇవ్వవలెనని అడిగాము. "మీరు కొంచెము restrcitions పెట్టుకోవాలి; agreement ప్రకారం పూర్తి supplly చేయలేమని" మద్రాసు ప్రభుత్వంవారు చెప్పారు. వారి reservoirs యొక్క capacity తగ్గిందని ఉత్పత్తి తగ్గుతోందని supply తగ్గుతుందేమో అని హెచ్చరిక చేశారు. రేణిగుంట power station ఎప్పుడు full Production కు వస్తుందో అప్పుడు చిత్తూరుజిల్లా అభివృద్ధిపరచడానికి అవకాశం ఉంటుందని మనవిచేస్తున్నాను. దానిని తొందరగా పూర్తిచేస్తున్నాము. గోపాలురెడ్డిగారుకూడా చిత్తూరుజిల్లా స్కీమునుగురించి తెలియచేసారు. వారుచెప్పిన తిరుత్తని స్కీముకూడా execution లోనికి వచ్చింది. మరొకటి తొందరలో ఆమోదింపబడుతోందని తెలియచేస్తున్నాను. Register అన్నీ తీసి చదవాలంటే delay అవుతుంది. Brochure ఒకటి తయారుచేస్తున్నాము. అందులో ఆంధ్రస్టేటు form అయినప్పటి నుంచి జరిగిన అభివృద్ధిగురించి ప్రకటనచేస్తాము. లక్ష్మణదాసుగారి పాతపట్నం లోని స్కీము sanction అయినది. డబ్బులేక ఈ సంవత్సరమే అమలు పరచలేక పోయాము. April లో అమలు జరుగుతుంది. కనిగిరిస్కీముకూడా April లోనే అమలుచేస్తాము. April నెలలో ఇవన్నీ అమలు అవుతాయి. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో ఎక్కువ భాగం industries కు వెళ్లుతుంది; గ్రామాలకు ఏమి మిగులుతుందనే సందేహం ప్రకటించారు. కొంతవరకు అందులో యదార్థం ఉన్నదని చెప్పకతప్పదు. ఇప్పటి allotment 569 లక్షలు. నాగార్జునసాగర్ స్కీము 96 లక్షల స్కీము. 96 లక్షలు మన డిపార్టుమెంటుకు అప్పుగా ఇవ్వాలని బోర్డుసిఫార్సుతో కేంద్రప్రభుత్వానికి వ్రాసిఉన్నాము. Sanction చేయుస్తామని

Sri G. Latchanna] [27th March 1956

కేంద్రప్రభుత్వ ప్రతినిధులు చెప్పారు. ఆవిధంగానే 75 లక్షలు రూపాయలు తెచ్చి ferro manganese factory reaollotment చేయడానికి తీర్మానం చేశాము దీనికై loan తీసుకోడానికి కేంద్రప్రభుత్వంతో సంప్రదిస్తున్నాము. కేంద్రప్రభుత్వంవారు First Five Year Plan లోని 39 లక్షలకు స్కీములు పంపిస్తే additional grants ఇస్తాము అన్నారు గతనెలలో పంపితే 39 లక్షలు sanction చేశారు. మరొక 20 లక్షలు rural schemes క్రింద ఇవ్వడానికివీలు ఉంటుందేమో చూస్తామని చెప్పారు. Loans మీద ferro-manganese స్కీము, నాగార్జునసాగర్ స్కీములకో డబ్బు తెచ్చుకుంటే గ్రామాలకు సంబంధించిన స్కీములకు ఈ ఏడాది జరిగినదానికంటె ఎక్కువ జరుగుతుందేకాని తగ్గడానికి అవకాశం ఉండదని నాకు విశ్వాసం ఉన్నది. 569 లక్షల రూపాయిల మీదనే ఆధారపడే ప్రశ్న అయితే గ్రామీణప్రాంతాలకు 35 లక్షలే ఉంటుందేమో కాని ఈ విధంగా 95 లక్షలు నాగార్జునసాగర్ గురించి, 75 లక్షలు ferro manganese factory గురించి ప్రత్యేకపద్దులు తెచ్చుకుంటే గ్రామీణప్రాంతాలకు ఎక్కువగానే వస్తుంది. ఢిల్లిలో Finance Minister గారితో గతనెలలో చర్చిస్తే June నెలలోవస్తే special loans ఇవ్వడానికి వీలు ఉంటుందేమో చూస్తామని అన్నారు. Finance Minister గారితోను Planning Commission Chairman నంది గారితోను Central Water Power Commission సభ్యులతోను 39 లక్షలు sanction చేయాలని చెప్పడం, June లో అదనమైన provision చూపించడానికి ప్రయత్నిస్తామని వారు హామీ ఇవ్వడంజరిగింది ఈ పరిస్థితులలో గ్రామీణ schemes కు అవకాశం ఉండదేమో అని భావించవలసిన అవసరం ఉండదు. దీనికి తగిన శ్రద్ధ ప్రభుత్వం తీసుకుంటుంది. ప్రభుత్వ ప్రయత్నం ఫలిస్తుందనే చెబుతున్నాను. Cut motions లో స్కీము ఉన్న ఫిరంగిపురం April నెలలోనే అమలులోనికి వస్తుంది. ఇది 16 గ్రామాలకు సంబంధించిన స్కీము. ఫిరంగిపురంవరకు line నిర్మాణంచేసి కొన్ని గ్రామాలకు అమలుచేసి క్రమక్రమంగా అభివృద్ధి పరుస్తాము. సత్తెనపల్లి స్కీము ప్రభుత్వం అచరణలో పెట్టాలనే ఆలోచనలో ఉంది. ప్రభుత్వం ఏ స్కీము పట్లకూడా అశ్రద్ధ చేసేదిలేదు. ఉత్పత్తిని పెంచడానికి ప్రయత్నంచేస్తూ వీలయినంత తొందరగా గ్రామాలకు అందుబాటు చేయాలని ఆతురతతో పనిచేస్తున్నాము. మీకు మనవిచేసేది ఏమిటంటే, ప్రజలు సంపూర్ణ సహకారం ఇచ్చి తోడ్పడితే వచ్చే ఏడాదిలో ప్రభుత్వం ఆశిస్తున్న విధంగా రోజుకు ఒక గ్రామం మాత్రంమీద 360 గ్రామాలకయినా electricity సరఫరా చేయడానికి వీలు ఉంటుంది అని ఆశిస్తున్నాను.

27th March 1956]

SRI L. LAKSHMANA DAS:—నేను Non-official Committee ని గురించి చెప్పాను. దానినిగురించి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తుందా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇప్పుడు officials మీద ఉన్న నిందలు, అపోహలు పంచుకోనడం non-officials కు ఉచితమా, అని ఆలోచించుకోవాలి. అందరూ ఏకమైనారని చెప్పుకోక తప్పదు. పంపకం కుదర లేదనే నింద రావచ్చును ఇది జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయము, తొందరపడి చెప్పడానికి అవకాశములేదని మనవిచేస్తున్నాను.

SRI C. SUBBARAYUDU :—మునిసిప్యాలిటీలలోను, మేజరు పంచాయితీలలోను licence ఇవ్వడములో విపరీతమైన ఆలస్యము జరుగుచున్నది. Licence ఇస్తేనేగాని electric current ను ఇవ్వరు. మంత్రిగారికి చెప్పడము వారు ఇంజనీరుకు చెప్పడము జరిగింది. కాని ఏమీ చర్య తీసుకోలేదు.

THE HON. SRI G. LATCHANNA :—ఇది ఒక్క Electricity Department కు సంబంధించిన సమస్యకాదు. కొన్ని complaints వచ్చాయి. లైసెన్సు ఇవ్వవలసిన అధికారులువేరు. లైసెన్సు ఇచ్చిన తరువాత కాని ఎలక్ట్రిసిటీ సరఫరాచేసే అవకాశంలేదు. లైసెన్సు ఇచ్చే department కూడా నిర్ణీతకాలములో ఇస్తే బాగుంటుంది. లోకలు బోర్డ్సుతోను, Health Department తోను consult చేయవలసిఉన్నది. ఇవి అనేక department లకు సంబంధించినవి కాబట్టి తొందరగా పనులు జరగడానికి అవకాశములేదు. అయినా అధికారులతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతూ ఉన్నాము,

Sri C. SUBBARAYUDU :—Oil engine అయితే Director of Public Health approve చేసి పంచాయితీ తీర్మానముచేసిన తరువాత Time లిమిటులో ఇవ్వకపోతే oil engine instal చేసి run చేసినా అభ్యంతరం లేదు. ఆవిధముగా జరుగుతూ ఉన్నది. Oil engine కు లేనినిబంధన electricity కి ఎందుకు పెట్టవలెను ?

The Hon. Sri G. LATCHANNA:—ఇది ఒక్క department కు సంబంధించిన సమస్యకాదు. ఆ డిపార్టుమెంటులగురించి నేను సమాధానము చెప్పడానికి సాధ్యముకాదు. వాటినిగురించి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతూఉన్నాము. త్వరలో అమలు జరుపడానికి ప్రయత్నము చేస్తామని మనవి చేస్తున్నాను. మునగాలవిషయమై ఏమి చేశారని

వెంకటేశ్వర్లుగారు అన్నారు. నేను చెప్పాను కనుక చెయ్యరేమో అన్న అపోహ వారికి ఉన్నది దీనిని investigation చేసి పంపమని తాఖీదు ప్రభుత్వం పంపింది. సూపరింటెండెంటు ఆఫీసునుంచి చీఫుఇంజనీరు ఆఫీసుకు పరిశీలనకుగాను వెళ్లుతూ ఉన్నది. ప్రభుత్వానికి అది చేరగానే అమలు పరుస్తామని మనవిచేస్తున్నాము. లోపములు ఉంటే, సభ్యులు ఈ శాసనసభలోనే కాకుండా ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారాగాని, సమావేశము అయ్యే సందర్భములోగాని తెలియచేస్తే వెంటనే తప్పకుండా చర్యతీసుకుంటాము. సభ్యులందరి సహకారముతో మనకున్న ప్రత్యేక పరిస్థితులలో మన రాష్ట్రం electricity ఉత్పత్తిని అభివృద్ధి చేసికొని తద్వారా రాష్ట్ర అభివృద్ధికోసము కృషి చెయ్యడానికి తోడ్పడతారని ఆశిస్తున్నాను. దయచేసి cut motion ఉపసంహరించుకొని ఈ డిమాండును ఏకగ్రీవముగా ఆమోదించవలెనని కోరుతున్నాను ఏకగ్రీవముగా ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

SRI L. LAXMANA DAS :—కమిటీ అంటే మంత్రిగారు అపోహలు రావచ్చును అన్నారు. ఏదైనా జరిగినపుడు enquiry కోసము non-official committee వేస్తే భయముగా ఉంటుంది అనే ఉద్దేశముతో చెప్పేను

THE HON. SRI G. LATCHANNA :—Department లోని లోటు పాటులు ప్రజల దృష్టికి వచ్చే స్థితిలో ఉంటే డిపార్టుమెంటుకు భయం ఉంటుంది అనే ఆలోచనతో వారు చెప్పారు. కాని ఇందులో సాధకబాధకాలు ఉన్నవి. ప్రభుత్వ డిపార్టుమెంటు చర్యతీసుకొని రిపోర్టుచేస్తే ఇది అబద్ధపు రిపోర్టు అని అనధికారుల సలహాలుకూడా ఉన్నవి. కాబట్టి ఇవి నిరోపయోగం కావచ్చును. వారు చర్యతీసుకోనడానికి సిద్ధముగా ఉన్నప్పుడు అనధికార్ల సిపార్సులు, గ్రాయబారములు కొన్ని కొన్ని ఉండవచ్చును. అందువల్ల ఈ విషయము ఆలోచించవలసి ఉన్నదని మనవిచేస్తున్నాను.

SRI T. LAKSHMINARAYANA REDDI :—రాజమండ్రిలో domestic consumption rates చాలా ఎక్కువగా ఉన్నవి, prohibitive గా ఉన్నవి. తగ్గించడానికి ఏమైనా ప్రయత్నం చేస్తారా.

THE HON. SRI G. LATCHANNA :—రాజమండ్రి కార్పొరేషను private సంస్థ. దానిని మార్చి ఒకటవ తేదీనుండి ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి నోటీసు ఇచ్చింది. అయితే కొంతమంది share holders High Court కు పోగా, ఇద్దరు Administrators ను 6 మాసాలకు నియమించడం జరిగింది.

April 20 వ తేదీవరకు ఉన్నందువల్ల, గడువు April 20 వరకు స్వాధీనపరచుకో డానికి వీలు లేదు. ప్రభుత్వానికి హైకోర్టువారు ఆర్డరు జారీచేసినందువల్ల ఇంతవరకు స్వాధీనపరచుకోడానికి వీలు లేదు. April 20 నాటికి ఆ సంస్థ ప్రభుత్వ స్వాధీనం లోనికి వస్తుందని ఆశిస్తున్నాను. దానికికూడా కొంతమంది writ petition వేశారు. Private corporation గా ఉంచే ప్రయత్నాలు జరుగుచున్నవి. కాని అవి ఫలిస్తాయని నేను అనుకోను. April 20 నాటికి స్వాధీనములోనికి రాగానే rates తగ్గించడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుంది.

The cut motion of Sri R. B. Ramakrishna Raju (No. 458) was, by leave of the House, withdrawn.

MR. SPEAKER :—The question is :

To reduce the allotment of Rs. 1,08,94,600 for Electricity by Rs. 100.

(ఫిరంగిపురం–నర్సరావుపేట లైను పూర్తిచేసి సత్తెనపల్లి తాలూకాలో పాసుకు పాడు, నొర్ని పాడు, లక్కరాజు గార్లపాడు, ముప్పాళ్ల, గోళ్లపాడు, మాదల గ్రామాలకు శివారులో విద్యుచ్ఛక్తి వ్యవసాయానికి యిప్పించవలసిందిగా.)

The motion was lost.

MR. SPEAKER :—The question is :

To reduce the allotment of Rs. 1,08,94,600 for Electricity by Rs. 100.

(To discuss the failure of the Government to make arrangements to supply electrical energy in Munagala Paragana in Nandigama Taluk.)

The motion was lost.

Mr. SPEAKER :—The question is :

"That Government be granted a sum not exceeding Rs. 1,08,94,600 under Demand XXVII—Electricity."

The motion was carried and the grant made.

MR. SPEAKER :—There are no cut motions for the next Demand and so I shall put the Demand to the vote of the House.

The question is :

"That Government be granted a sum not exceeding Rs. 11,92,42,000 under Demand XL—Capital Outlay on Electricity Scheme."

The motion was carried and the grant made.

MR. SPEAKER :—The House will now adjourn and meet to-morrow at 8-30 a.m.

The House then adjourned.

*Paper laid on the Table of the House.*

Motor Vehicles—Taxation—Red Cross Ambulance Van A.D.Q. 779 belonging to Dr. M. C. Modi—Exempted from levy of tax (G.O. Ms. No. 316, Public Works and Transport Dated 3—2—1956).